# చతుర

ఫిబ్రవరి 2009

రూ. 10/-



బంగారు బొమ్మ

... !!ం లో



వేంపల్లి గంగాధర్

## నేలదిగిన వాన

జన్మదిన సంచిక

# కాప్షన్ మీదే - 2




ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు నవ్వొచ్చే కాప్షన్ రాయండి. శ్రీధర్ ఆటోగ్రాఫ్‌సహా చక్కని బహుమతి అందుకోండి! బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఫిబ్రవరి 16

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082

e-mail : chatura@eenadu.net

ఉత్తమ వ్యాఖ్య :

కాయ ఎప్పుడు కాసేను?
నేనెప్పుడు కోసేను?

-మణికుమార్,
తుకారాంగేట్, సికింద్రాబాద్



## కాప్షన్ మీదే -1

బాగున్న మరికొన్ని కాప్షన్లు

కాయ్ రాజా కాయ్!
కలలో కాయలు కాయ్
-కందాళై రాఘవాచార్య,
నిజామాబాద్

కొందరింతే!
కాయలొచ్చేదాకా కలలు వీడరు!
- మంత్రి కృష్ణమోహన్,
మార్కాపురం

'ఫలయజ్ఞం'
- వి.వీరభద్రరావు,
నాచారం, హైదరాబాద్

ఆ పండు చేతికందేసరికి నువ్వు
'పండు'పై పోతావేమో బ్రదర్!
-లోగిశం లక్ష్మీనాయుడు,
సింహాచలం

# రచయితలకు సూచనలు



**నవ్యనవలా వేదిక 'చతుర'కు రచనలు పంపేవారు ఈ కింది సూచనల్ని గమనించాలి.**

---

★ చతురకు నవలలు పంపేవారు సామాజిక సమస్యలపై దృష్టి పెట్టాలి. హాస్య, వ్యంగ్య తదితర ఏ ఇతివృత్తమైనా ఎంచుకోవచ్చు. ఏ మాండలికమైనా రాయొచ్చు. వైవిధ్య కథా వస్తువులకు ప్రాధాన్యం ఉంటుంది. నవ్యతకే పెద్దపీట.

★ బొమ్మలు, వివిధ శీర్షికలు, ప్రకటనలు పోను 'చతుర' నవల అచ్చులో 80-85 పేజీలు ఉంటుంది. దీన్ని దృష్టిలో పెట్టుకుని రచయితలు తమ నవలల్ని అచ్చులో 85 పేజీలు మించకుండా రాసి పంపాలి.

★ ఒక పాత 'చతుర' సంచిక తీసుకుని అందులో ఉన్న నవలలో ఒకటి లేదా రెండు పూర్తి పేజీలను తమ దస్తూరితో రాసి చూసుకుని ఆ మేరకు తమ నవల రాతప్రతి ఎన్ని పేజీలలో రాయవచ్చో అంచనాకు రావడం సులభం. ఏదేమైనా అచ్చులో 80-85 పేజీలకు మించకుండా లేదా తక్కువ కాకుండా ప్లాన్ చేసుకుని పంపడం మంచి పద్ధతి.

★ ప్రచురణకు స్వీకరించని నవలలు/రచనలు తిప్పిపంపేందుకు వీలుగా స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవరు జతపరచడం మరువకండి. రాతప్రతులు పోస్టులో పోతే 'చతుర' బాధ్యత వహించబోదు.

★ స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవర్లు జతపరచని వారి రచనలు తిరస్కారానికి గురైతే ట్రాష్‌లోకి వెళ్లిపోతాయి. వాటి గురించి ఉత్తరప్రత్యుత్తరాలకు తావులేదు.

★ సాధారణంగా నవలలు కార్యాలయానికి అందిన 4 - 8 వారాలలోగా పరిశీలించి ప్రచురణార్హమైతే ఆ విషయం తెలియపరుస్తాం. కాకుంటే తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రచురితమైన ప్రతి నవలకు రూ. 6000/- పారితోషికం ఉంటుంది. నవల ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటి వారంలోనే పై మొత్తానికి రచయితకు చెక్కు అందుతుంది.

★ 'కొత్తగాలి' శీర్షికకు చిరుకవితలు పంపేవారు నాలుగు/ఐదు పంక్తులు మించకుండా పంపాలి. స్పార్క్‌కే మార్కు అన్న విషయం గుర్తించాలి.

**చతుర**


**చిరునామా :**

**ఎడిటర్, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్-500082**

సంపుటి -32
సంచిక - 01
ఫిబ్రవరి 2009
373వ సంచిక

# చతుర



ముఖచిత్రం : స్నేహ

ముఖపత్రాలంకరణ : రాజుయాట



నిజంగా ఆ క్షణం
ఆంజనేయులు దేవుని
లెక్కనే కన్పించినాడు.
"పనిలోకి పిల్సుకపోతావా?"
అడిగితి.
"రావాల్నే గానీ
ఈ రేత్తిరికే పిల్సుకపోతా"
జెప్పినాడు.
"మాటికంతా మంచి గొడ్డలి
తీసుకుని చెరువుకాడికి వస్తే
మోలీకాడ నేనుంటా.
పన్లోకి పిల్సుకపోతా"
అని హామీ ఇచ్చినాడు వాడు.
ఆంజనేయులు ఎవరు?
ఎలాంటి పనికి తీసుకెళ్లాడు?
తెలుసుకోవాలంటే
**వేంపల్లి గంగాధర్** నవల

## నేల దిగిన వాన

చదవాల్సిందే!

14 వ పేజీలో

బొమ్మలు: ఆనంద్

## ఈ శంకరుడు

# మళయాళీ మణిప్రాస

**భారతీయ సాహితీరంగంలో జ్ఞానపీఠ పురస్కారం అత్యంత ప్రతిష్ఠాత్మక స్థానం సంతరించుకుంది. సాహుశాంతి ప్రసాద్ జైన్ స్థాపించిన భారతీయ జ్ఞానపీఠం సంస్థ దీనిని ప్రతి సంవత్సరం ప్రదానం చేస్తుంది. ప్రస్తుత నిబంధనల ప్రకారం, సజీవులైన సృజనాత్మక సాహిత్యకారులకు సద్యఃపూర్వం ఇరవైయేళ్ల కృషి ఆధారంగా ఈ గౌరవం లభిస్తుంది. నగదు పారితోషికంతో పాటు, ధారా నగరంలో భోజరాజు నిర్మించిన సరస్వతీ ఆలయంలోని దేవీ విగ్రహ అనుకృతిగా వాగ్దేవి ప్రతిమ బహూకరిస్తారు.**

నాలుగు ప్రధాన దాక్షిణాత్య భాషల్లో చివరిదైన మళయాళానికి ప్రప్రథమంగా 1965లో జ్ఞానపీఠ పురస్కారం లభించడం విశేషం. 'ఒటక్కుఝల్' (వేణువు) కర్త మహాకవి గోవిందశంకర కురుప్‌కి ఈ ఘనత దక్కింది. కురుప్ కేరళ రాష్ట్రం కాలడికి చేరువలో వున్న 'నాయత్తోడ్'లో 1901 జూన్‌లో జన్మించాడు. పెరియార్ నదీతీరంలో వున్న ఈ కుగ్రామం ప్రకృతి అందాలకు ఆటపట్టు. తండ్రి నెల్లికపిల్లి శంకరవార్యర్. తల్లి వడక్కన్ వీట్టిల్ లక్ష్మి కుట్టియమ్మ. వారిది సామాన్య కుటుంబం. ఆ ఊరి వేల్పు శంకరనారాయణ మందిరం సమీపంలో వుంది. కురుప్‌కు చిన్ననాటి నుంచి దైవభక్తి మెండు. అయిదో ఏటనే పితృవియోగం వల్ల మేనమామ గోవిందకురుప్ వద్ద విద్యాబుద్ధులు నేర్చాడు. మేనమామ సంస్కృతంలో, జ్యోతిషంలో దిట్ట. మేనల్లుణ్ణి తనంతవాడుగా చేయాలని ఆయన సంకల్పం. ఏడోయేటనే కురుప్ 'అమరకోశం' కంఠస్థం చేశాడు. వేదాంత గ్రంథ పఠనం ఆరంభించాడు. హయ్యర్ సెకండరీ పరీక్ష తర్వాత ఉపాధ్యాయ వృత్తి చేపట్టాడు. విద్వాన్ ఉత్తీర్ణత పిమ్మట తిరువిల్వమలలో మళయాళ పండితుడుగా, తిరుచూరులో శిక్షణ కళాశాల అధ్యాపకుడిగా, ఎర్నాకుళంలోని మహారాజా కళాశాలలో ఆచార్యుడుగా పనిచేసి 1956లో పదవీవిరమణ చేశాడు. అనంతరం తిరువేంద్రం ఆకాశవాణి కేంద్రంలో ప్రయోక్తగా, కేరళ సాహిత్య అకాడమీ, సమస్త కేరళ సాహిత్య పరిషత్తు అధ్యక్షుడుగా సేవలందించాడు. కేరళ సాహిత్య అకాడమీ అవార్డు, సోవియట్ ల్యాండ్ అవార్డు పొందిన కురుప్‌ను




రాజ్యసభ సభ్యుడిగా రాష్ట్రపతి నామనిర్దేశం చేశారు. భారతప్రభుత్వం 'పద్మభూషణ్' గౌరవంతో సత్కరించింది. జీవితాంతం సాహిత్య సృజనచేస్తూ మహాకవి కురుప్ 1978 ఫిబ్రవరి 2న స్వర్గస్థుడయ్యాడు.

కురుప్‌లో మేనమామ సంస్కృత పాండిత్యం, ఉపాధ్యాయులు శంకరపిళ్ళై కవితా పాటవం, ఆర్.సి. శర్మ భాషాభిమానం, ఎం.ఎన్. నాయర్ సామ్యవాద భావాలు పెంపొందించారు. విద్యార్థిగానే కురుప్ కవితారచనకు శ్రీకారం చుట్టాడు.

## సరికొత్త శీర్షిక ప్రారంభం!


మహాకవి శంకర కురుప్

4వ తరగతిలో వుండగా తనకు అనారోగ్య దశలో తోడ్పడిన మిత్రుడికి కవితారూపంలో కృతజ్ఞత తెలిపాడు. గాంధీ, మార్క్స్, కాళిదాసు, రవీంద్రుడు, ఉమర్ ఖయ్యాం, కీట్స్, షెల్లీల ప్రభావం కురుప్‌పై పడింది. నిరంతరంగా సాగిన ఆయన రచనల్లో ప్రకృతి ఆరాధన, దైవభక్తి, దేశాభిమానం, అభ్యుదయ భావజాలం, ప్రతీకాత్మకత, మానవీయ మూలాలు, మార్మికత, అద్వైతవాదం, తాత్వికత, శాస్త్రీయ దృక్పథం వంటి ఉన్నత లక్షణాలు చోటు చేసుకున్నాయి. రాజరాజవర్మ, కుమరన్ ఆసన్, వల్లతోవ్ నారాయణ మీనన్, ఉల్లూర్ పరమేశ్వరయ్యర్ చూపిన నూతన కవితామార్గాన్ని కురుప్ తేజోవిలసితం చేశాడు. ఆయనది అద్భుతశైలి. ఆయన వెలువరించిన తొలి కవితా సంపుటి 'సాహిత్య కౌతకం' (4 భాగాలు). ఉమర్‌ఖయ్యాం కవితను 'విలాస లహరి' పేరుతో పడవ పాట బాణీలో అనువదించాడు. జ్ఞానపీఠం పురస్కారం పొందిన 'ఒటక్కుషల్' (వేణువు) 1950లో వెలువడింది. ఇది 60 కవితల సంపుటి. ఒటక్కుషల్ చిన్న కవిత. ఇలా సాగుతుంది: "ఓ పరమాత్మా! నీవు వినిపించే జీవన సంగీతం/ నీ మహిమాన్విత సన్నిధి/ స్థలకాలాలకు అతీతాలు./అజ్ఞాత సీమలో పరిత్యక్తమై/ఎవరి కంటా పడకుండా/ఎండవానల కోర్చిన/ఈ దుర్బలా కృతి/నీ కరుణ వల్ల వేణువుగా మారింది./అల్పమైన వెదురుముక్క/నీ శ్వాసతో జీవం నింపుకుంది/చేతనా చేతనాలన్నింటినీ మంత్రముగ్ధం చేస్తోంది./దివ్య గాయకమౌళి మనసులను సమ్మోహనపరిచే నీవు/కృపతో సంగీతంగా మారి నాలో వెలసివున్నావు/లేనట్లయితే/ఆనందపారవశ్యంతో జీవనగీతాలు ఎలా పాడగలను!" ఈ కవిత ప్రతీకాత్మకతకు గొప్ప ఉదాహరణ.

కురుప్ సృజించిన నవతిథి, వనగాయకన్, చెమక్ తిరుకళ్, ముత్తుకళ్, అంతర్దాహం, విశ్వదర్శనం, మధురం-సౌమ్యం-దీప్తం, సంధ్యారాగం, నిమిషం, పూజాపుష్పం మొదలైన 23 కవితా సంపుటాలు; మూన్ను అరువియం ఒరుపూషయం, స్వాతంత్ర్యోదయం అనే 2 కథాకావ్యాలు; 3 కవితానువాదాలు, 3 బాలసాహిత్య కవితాసంపుటాలు, 6 గద్యకృతులు, 5 నాటకాలు, 3 కథాసంపుటాలు, 3 జీవిత చరిత్రలు, 3 విమర్శ గ్రంథాలు మళయాళ సాహిత్యాన్ని సుసంపన్నం చేశాయి.

జ్ఞానపీఠ పురస్కారం ద్వారా అందిన లక్ష రూపాయల నగదుతో 'ఒటక్కుషల్ అవార్డు' నెలకొల్పి, మళయాళ భాషలో వెలువడే ఉత్తమ కావ్యానికి బహుమతినిచ్చే ఏర్పాటు చేసిన గోవిందశంకర కురుప్ మహాకవి మహోన్నతుడు. జ్ఞానపీఠ పురస్కారం ప్రథమంగా ఆయనను వరించి మరింత స్థాయిని పెంచుకుంది.

**- గోవిందరాజు రామకృష్ణారావు**

## అపార్ట్‌మెంటాలజీ-13



# ఫామిలీ న్యూసెన్స్

యర్రంశెట్టి సాయి

ఆ రోజు పొద్దున్నే మా ఫ్లోర్‌లో పెద్దగా కేకలు, ఏడుపులు వినిపించేసరికి మా బ్లాక్‌లోవాళ్ళ నిద్ర చెడిపోయింది.

గొడవేంటా అని షర్ట్ వేసుకుని బయటకు నడిచాను- అప్పటికే త్రీనాట్ సిక్స్ ఫ్లాట్ ముందు మా అసోసియేషన్ ప్రెసిడెంట్ హమీద్‌మియా, జనరల్ సెక్రటరీ మొహిందర్, కల్చరల్ సెక్రటరీ శంకరమూర్తి, లేడీస్‌వింగ్ ప్రెసిడెంట్ షైనీ, వైస్ ప్రెసిడెంట్ మంగతాయారు, విజయ్‌యాదవ్ గుమికూడి పోయారక్కడ.

"ఎన్నా ప్రాబ్లెమ్? ఏమి సరుగుతావుండాది?" అంది సీతా వరదరాజన్.

"ఆ ఫ్లాట్‌లో రాజేశ్వర్ అనే అతను ఉంటయ్. రాజేశ్వర్ కొక్కటి భార్య, ఒక్కటి తండ్రి, ఒక్కటి తల్లితో ఉంటున్నయ్- రాజేశ్వర్‌కి మా బాప్‌కే సాత్ జగడా హోగయా!" అంటూ కొన్ని వివరాలందించాడు హమీద్‌మియా.

అప్పుడు సంగతి నాకర్థమయింది.

ఈ మధ్య రాజేశ్వర్ భార్యకీ అతని తల్లిదండ్రులకూ గొడవలవుతూనే ఉన్నయ్.

అత్తాకోడళ్ళ గొడవలు నార్మలేనని మేమెవరమూ పట్టించుకోలేదు.

కానీ రాన్రాను అవి ఎక్కువయిపోయినయ్. ముఖ్యంగా రాజేశ్వర్ తన భార్యే కరెక్ట్- తన తల్లిదండ్రులదే తప్పంతా- అంటూ స్టేట్‌మెంట్ ఇచ్చేసరికి గొడవలు ఇంకా పెరిగిపోయాయ్.

శంకరమూర్తికి జరిగిందంతా చెప్పన్నాడు రాజేశ్వర్.

"సార్- తప్పంతా నా తల్లిదండ్రుల్దేసార్- అన్నిటికీ నా మిసెస్‌తో గొడవ పడుతూంటారు. తిడుతూంటారు. సూటిపోటి మాటలంటారు- ఎవరయినా అలాంటి అవమానాలు ఎంత కాలం సహిస్తారు? అందుకే నా మిసెస్ ఎదురుతిరిగింది. వాళ్ళు ఒకమాటంటే తను రెండు మాటలనటం మొదలుపెట్టింది.

అక్కడికీ నేను ముగ్గురినీ దగ్గర కూర్చోబెట్టుకుని నచ్చచెప్పాను- వింటేనా? పైగా నన్ను కూడా ఏ కన్నతండ్రీ, తల్లి తిట్టని తిట్లు తిడుతున్నారు సార్- అందుకని నా ఇంటి నుంచి బయటకు పొమ్మన్నాను-"

శంకరమూర్తి కల్పించుకున్నాడు.

"ఇదిగో చూడు రాజేశ్వర్! వాళ్ళెన్ని తిట్టినా, అడ్జస్ట్ చేసుకోవాలిగానీ అలా బయటకు గెంటటం బాగుండదు-"

అందరూ కలిసి రాజేశ్వర్ దంపతులకూ, అతడి తల్లిదండ్రులకూ నచ్చజెప్పి- ఇంట్లోకి పంపిస్తున్న వేళ దిగాడు మా అపార్ట్‌మెంట్స్‌లోనే ఉంటున్న శ్రీనివాస్ రెడ్డి. అతని వెనుకే ఛానెల్ కెమెరామెన్.

శ్రీనివాస్‌రెడ్డి ఈమధ్యే మా అపార్ట్‌మెంట్స్‌లో దిగాడు. అతను తుగ్లక్ ఛానెల్ జర్నలిస్ట్.

ఎక్కడేం గొడవ జరిగినా తక్షణం కెమెరామెన్‌తో పాటు వాలిపోయి కవరేజ్ ఇవ్వటం అతనికి బాగా అలవాటు.

రావటంతోనే కెమెరాని రాజేశ్వర్ అపార్ట్‌మెంట్‌వేపు ఫోకస్ చేశాడు. ఫ్లాట్స్ లేడీసంతా అతని చుట్టూ మూగిపోయారు.

అతను మాత్రం ఛానెల్‌కి కామెంటరీ ఇస్తున్నాడు.

"గజనీ- ఈ రాంభరోసా అపార్ట్‌మెంట్స్‌లో రాజేశ్వర్ అనే యువకుడు, తన భార్య చెప్పుడు మాటలు విని వృద్ధాప్యంలో వున్న కన్నతల్లినీ, తండ్రినీ ఇంటి నుంచి బయటకు గెంటాడు.. గజనీ!"

"రాజేశ్వర్ ఏంచేస్తుంటాడు శ్రీనివాస్? "

"అతను ఒక సాధారణ వ్యక్తి అయితే ఫరవాలేదు గజనీ! కానీ అతను ఒక టి.వి. ఆర్టిస్ట్! యాక్టర్‌గా పైకొస్తున్నాడు- ఒక వర్ధమాన నటుడిగా దేశానికి ఆదర్శంగా నిలవాల్సిందిపోయి ప్రత్యక్ష దైవాల్లాంటి తల్లిదండ్రుల్ని నిర్దాక్షిణ్యంగా కేవలం భార్య మాటలు విని బయటకు గెంటాడంటే అది చాలా దారుణం, అమానుషం గజనీ!"

"అసలు రాజేశ్వర్ భార్యకూ, అత్తమామలకూ గొడవలెందుకొచ్చాయ్? ఆ విషయంలో ఆ అపార్ట్‌మెంట్స్‌లో ఉన్న మిగతా రెసిడెంట్స్ ఏమంటున్నారు? "

"వాళ్ళ మధ్య గొడవలు రావడానికి చాలా కారణాలున్నట్లు తెలుస్తోంది గజనీ! మొదటిది- ఆ వృద్ధదంపతుల కనీసావసరాలు వాళ్ళ కోడలు సమకూర్చక పోవటం గజనీ- అదే కాకుండా వారిని శారీరకంగా, మానసికంగా కూడా హింసిస్తూ వేధిస్తూ, దౌర్జన్యానికి పాల్పడుతోందని ఆ వృద్ధదంపతులు చెప్తున్నారు గజనీ"

"నిజంగా ఇది చాలా అమానుషమయిన ప్రవర్తన శ్రీనివాస్! ఆ దంపతులేమయినా మాట్లాడారా? వాళ్ళ రియాక్షన్ ఏమిటి? "

"ఇప్పుడే కెమెరా వాళ్లముందుకొస్తోంది గజనీ- ఒక్క నిమిషం! ఆ చెప్పండి సార్- మీ అబ్బాయి మిమ్మల్ని కట్టుబట్టలతో బయటకు గెంటినట్లు తెలుస్తోంది. ఈ సమయంలో మీరెలా ఫీలవుతున్నారు? "

"మా ఇద్దరికీ కాలిపోతోంది. కొడుకూ కోడలూ ఛస్తే బావుండునని ఉంది"

"గజనీ! ఇద్దరికీ కాలిపోతోందంటున్నారు! వాళ్లే కాదు- ఈ అపార్ట్‌మెంట్‌వాసులు కూడా అలాగే ఫీలవుతున్నారు గజనీ- ముందు అసోసియేషన్ విమన్స్ ప్రెసిడెంట్ అభిప్రాయం తెలుసుకుందాం! షైనీ! ఈ రాజేశ్వర్ తల్లి దండ్రుల సమస్య గురించి మీరెలా ఫీలవుతున్నారు? "

"చాలా హాపీగా ఫీలవుతున్నా! నన్నడిగితే- ప్రతి కొడుకూ కోడలూ కూడా ఇలాగే ప్రాబ్లెమ్స్ క్రియేట్ చేసే తల్లిదండ్రుల్ని నిర్దాక్షిణ్యంగా ఇంటినుంచి బయటకు గెంటాలి! పాపం రాజేశ్వర్ భార్య ఛాయను ఈ ముసలోడు, ముసల్దీ ఎంత నరకయాతన పెడుతున్నారో మనాళ్ళందరికీ తెలుసు- అసలు వీళ్ళను సజీవంగా దహనం చేసినా పాపం లేదు-"

"ఇదీ గజనీ- ఈ అపార్ట్‌మెంట్స్‌లోని యంగ్ గాళ్స్ అభిప్రాయం-"

"మరి వయసు మళ్ళిన స్త్రీల అభిప్రాయం ఏమిటి శ్రీనివాస్? "

"ఇప్పుడే అసోసియేషన్ వైస్ ప్రెసిడెంట్ మంగతాయారుగారిని ఆ విషయం అడిగి తెలుసుకుందాం గజనీ- గుడ్ మాణింగ్ మంగతాయారుగారూ! రాజేశ్వర్ సమస్య విషయంలో మీరెలా ఫీలవుతున్నారు? "

"ఇదంతా బరితెగించిపోతున్న కోడళ్ళ నియంతృత్వం! పెళ్ళాం చెప్పుడు మాటలు విని, తల్లిదండ్రుల్ని చిత్రహింసలు పెడుతున్న పాపం ఈ కొడుకులదే అని ఖచ్చితంగా అంటాను- నేటి కోడళ్ళే రేపటి అత్తలు అన్న కామన్ సెన్స్ వాళ్ళకుంటే ఈ సమస్యలు తలెత్తవు"

ఆమె డైలాగ్ పూర్తికాకుండానే ఓ కోడలు కెమెరా ముందుకు దూసుకొచ్చింది.

"అలా ఎందుకనుకోవాలి? నేటి అత్తలే నిన్నటి కోడళ్ళు అనుకుంటే ఏ సమస్యా ఉండదుగా"

"కోడళ్ళబుద్ధి మంచిదైతే ఏ సమస్యలూ రావు"

"మీ అత్తలకు పక్షపాత రోగం లేకుండా ఉంటే బాగుంటుందిగా! కూతురూ అల్లుడూ అనేసరికి- అల్లుడు కూతురి మాటే వినాలి! కొడుకూ కోడలూ అనేసరికి- కొడుకు పెళ్ళాం మాట ఛస్తే వినకూడదు- ఈ నికృష్టమయిన బుద్ధి వల్లే గొడవలు"

"చూశావ్ కదా గజనీ! అత్తా కోడళ్ల రిలేషన్‌షిప్ విషయంలో అభిప్రాయభేదాలు చాలా ఘాటుగా ఉంటున్నాయ్ గజనీ!"

"ఎవరెన్ని చెప్పినా, ఈ రోజుల్లో మానవత్వం మరుగున పడిపోతోందని అందరూ ఫీలవుతున్నారు శ్రీనివాస్! అత్తమామల మీద కోడళ్ళు చేసే దౌర్జన్యం పెరిగిపోతున్నట్లు మన ఛానెల్ ఇండిపెండెంట్‌గా నిర్వహించిన ఒక సర్వేలో తెలుస్తోంది. అలాగే భార్య మాటలు విని తల్లిదండ్రుల్ని రోడ్డు మీదకు గెంటుతున్న కొడుకుల సంఖ్య కూడా చాలా వేగంగా పెరిగిపోతుందని ఇంకో సర్వేలో తేలింది- ఈ విషయంలో ప్రభుత్వం ఎలాంటి చర్యలు తీసుకుంటోంది? అలాంటి వృద్ధులను ఆదుకోడానికి పోలీసులు ఏం చర్యలు చేపట్టారు? అనే విషయం గురించి మాట్లాడ్డానికి కలెక్టర్ వాయసరావ్, ఎస్పీ శ్రీలక్ష్మి రెండ్రోజులనుంచీ మన ఛానెల్లో వెయిట్ చేస్తున్నారు శ్రీనివాస్- ఇప్పుడు - కలెక్టర్ వాయసరావ్‌గారు-

మీరు తీరికలేని కార్యభారంతో ఉన్నా, మా ఛానెల్ కోరిన వెంటనే వచ్చి రెండు రోజుల్నుంచీ ఇక్కడే ఉండి మీ విలువయిన అభిప్రాయాన్ని తెలియజేస్తున్నందుకు సంతోషం వాయసరావ్ గారూ- ఇప్పుడు చెప్పండి.. అత్తామామలను, ఇంటి నుంచి బయటకు గెంటే సంస్కృతి ఎక్కువయిపోయిన నేపథ్యంలో మీ స్పందన ఏమిటి? "

"తుగ్లక్ ఛానెల్ ప్రేక్షకులకు నమస్కారం! మీరన్నది నిజమే గజనీ- వృద్ధుల మీద దౌర్జన్యం - వారిని బయటకు గెంటటం నిజంగా చాలా దారుణం! నా మటుకు నేనూ, మా మిసెస్ ఇద్దరం పేరెంట్స్‌ని దేవుళ్ళలాగా చూడాలనే ఆకాంక్షతో ఉన్న వాళ్ళం! పేరెంట్స్‌ని పూజించే లెవెల్లో వారిని గౌరవించాలనేది మా ఇద్దరి అభిప్రాయం- అది మన సంస్కృతి కూడా"

"చాలా బాగా చెప్పారండీ! యువతీ యువకులు మీ లాంటి ఐఏఎస్ ఆఫీసర్‌ని ఆదర్శంగా తీసుకుని పేరెంట్స్‌ని దేవుళ్ళలా చూసుకుంటే సమాజంలో కన్నీరనేది కన్పించదు. అన్నట్లు వాయసరావ్‌గారూ! మీ పేరెంట్స్‌ని మీరు అలాగే చూసుకుంటున్నారా? "

"ఆ.. అదీ.. అది.. ఆమధ్య మా అమ్మా, నాన్నా ఇద్దరూ ఆత్మహత్య చేసుకున్నారు- న్యూస్‌పేపర్స్‌లో చూసే ఉంటారు-"

"అవునవును! గుర్తుకొచ్చింది- వాళ్లెందుకు ఆత్మహత్య చేసుకున్నారు? "

"అదిప్పటికీ పజిల్‌గానే ఉంటుంది"

"మీ భార్య పేరెంట్స్ సంగతేంటి? "

"వాళ్ళిద్దరూ ఒకరోజు గుడికి వెళ్ళివస్తామని చెప్పి మాయమయ్యారు. దేశమంతా వెతికిస్తే అదేదో ఆశ్రమంలో అంట్లు తోముతూ, వంటపని చేస్తున్నారని తెలిసింది. నేనూ, నా భార్య వెళ్ళి బ్రతిమాలినా రావటానికి ఒప్పుకోలేదు భగవంతుని సేవలో నిమగ్నమవాలని వారి కోరిక-"

"కానీ అప్పట్లో న్యూస్ పేపర్లలో- మీరూ, మీ భార్యా చేయించే చాకిరీ భరించలేక







పారిపోయారని వార్తలు వచ్చాయ్-"

"అన్నీ అవాస్తవాలు-"

"ఇప్పుడు ఎస్పీ శ్రీలక్ష్మిగారితో మాట్లాడదాం- శ్రీలక్ష్మిగారూ! సొసైటీలో వృద్ధుల సమస్యలపై మీరెలా ఫీలవుతున్నారు?"

"తల్లిదండ్రులను సరిగ్గా చూడని పిల్లల మీద క్రిమినల్ కేసులు పెట్టి, అరెస్ట్ చేస్తే ఇలాంటి ఘాతుకాలు చాలావరకూ తగ్గిపోతాయ్. నిజానికి నేను చొరవ తీసుకుని తల్లిదండ్రులను ఇంటి నుంచి గెంటి వేసిన కొడుకులను చాలామందిని అదుపులోకి తీసుకుని బెదిరించాను. దానివల్ల చాలామంది తమ తల్లిదండ్రులను మళ్లీ తమ ఇంటికి తీసుకెళ్ళారు."

"కానీ- మీరు ఆ తల్లిదండ్రుల దగ్గరా, కొడుకుల దగ్గర కూడా లంచాలు లాగినట్లు పేపర్లలో వార్తలు వచ్చాయ్ కదా-"

"అంతా అబద్ధం! ఆ వార్త రాసిన జర్నలిస్ట్‌ని ఒకే ఒక్కరోజు లాకప్‌లో పెట్టేసరికి నేను అలాంటి అవినీతికి పాల్పడలేదని తనే మళ్లీ పేపర్లో రాశాడు-"

"కానీ ఆ తర్వాత మీరు అలాంటి చర్యలు ఎందుకు మానేశారు?"

"హోమ్ మినిస్టరుగారు వాటి జోలికి పోవద్దని అన్నారు. అందుకని"

"థాంక్యూ శ్రీలక్ష్మిగారూ- మీరు మీ విధులన్నీ పక్కన బెట్టి మా ఛానెల్ ప్రేక్షకులకు మీ విలువయిన అభిప్రాయాలను తెలియజేయడానికి విచ్చేసి రోజంతా ఇక్కడే గడిపినందుకు మా ధన్యవాదాలు-"

"శ్రీనివాస్! ఇప్పుడు రామ్‌భరోసా అపార్ట్‌మెంట్స్‌లో పరిస్థితి ఏంటి?"

"పరిస్థితి ఉద్రిక్తంగా ఉంది గజనీ! ఈ అపార్ట్‌మెంట్స్‌లో ఉంటున్న అత్తలూ, కోడళ్ళూ రెండు గ్రూపులుగా విడిపోయారు. అత్తల మీద కోడళ్ళూ, కోడళ్ళ మీద అత్తలూ తీవ్రస్థాయిలో ఆరోపణలు, నిందలు, బెదిరింపులు చేస్తున్నారు. ఏ క్షణాన్నయినా పరిస్థితి చేయిదాటే అవకాశం ఉందని నేనిప్పుడే పోలీస్‌ని ఎలర్ట్ చేయటం జరిగింది."

"థాంక్యూ శ్రీనివాస్! ఇప్పుడో చిన్న బ్రేక్-"

"దయచేసి ఛానెల్ మార్చకుండా మీకుపయోగపడే ఈ వ్యాపార ప్రకటనలు చూడండి-"

"మీ కొడుకులు, కోడళ్ళు మిమ్మల్ని చిత్రహింసలు పెడుతున్నారా? వెంటనే మా 'ఇలవేల్పు' వృద్ధాశ్రమంలో చేరండి! నెలకు ఒక్కొక్కరికి పదివేలు కడితే చాలు, మీకు సర్వసౌకర్యాలూ అందిస్తాం! స్వర్గం అంటే ఎక్కడో లేదు- మా 'ఇలవేల్పు'లోనే ఉంది.

రండి! త్వరగా చేరండి! మీ పిల్లలు పెట్టే నరకయాతన నుంచి తప్పించుకోండి! 24 గంటలూ వెన్నంటి ఉండే డాక్టర్ల సంరక్ష ణలో నిశ్చింతంగా గడపండి"

"శ్రీనివాస్! ఇప్పుడు తన తల్లిదండ్రులను నిర్దాక్షిణ్యంగా బయటకు గెంటిన రాజేశ్వర్ ఏమంటున్నారు? "

"రాజేశ్వర్‌గారూ! గజనీగారి ప్రశ్నకు మీ సమాధానం ఏమిటి? "

"చూడండి! మా తల్లిదండ్రులంటే నాకి ప్పటికీ గౌరవం ఉంది. కానీ వారు చేసే పనులవల్ల సమస్య వస్తోంది- మా నాన్న గారికి రోజుకి అయిదొందలు ఖర్చు- అమ్మ కి రోజుకి వెయ్యి రూపాయలు దుబారా- ఇంతడబ్బు నేనెక్కడి నుంచి తేను? "

"వాళ్ళంత డబ్బు ఏం చేస్తున్నారు? "

"మా ఫాదర్ రోజుకో ఫుల్‌బాటిల్ కొడ తారు- మా అమ్మకు మెడికల్ పిచ్చి- రోజుకో స్పెషలిస్ట్ దగ్గరకెళ్ళి వేలకువేలు టెస్ట్‌లకూ, ఫీజులకూ ఖర్చు చేయిస్తూం టుంది. మా నాన్నగారు ప్రతాదివారం రేసులాడ్డానికి నేనే డబ్బివ్వాలి"

"కానీ మీ నాన్నగారు సర్వీస్‌లో ఉండగా ఇంత ఖర్చు ఎలా మేనేజ్ చేసేవారు? "

"అప్పట్లో ఆయన మత్స్య శాఖలో ఈజీ గా లక్షలు సంపాదిస్తూండేవారు. అందు కని ఆ ఖర్చు, ఆ అలవాట్లు వచ్చాయ్-"

"ఛాయగారూ! అత్తామామల్ని వెళ్ళగొట్ట డానికి మీ మనసెలావప్పింది? "

"వెళ్ళగొట్టకపోతే- నేనూ, నా పిల్లలూ అడుక్కు తినాల్సి వస్తుంది.. ఏం? మీ ఛానెల్ వాళ్ళు పెళ్ళాం బిడ్డల గురించి ఆలోచించరా? "

"గజనీ! ఛాయగారు ఆవేశంలో ఉన్నారు- ఆమెకు బీపీ అని చుట్టుపక్కల వాళ్ళు చెప్తున్నారు. అందుకని ఆమెను ప్రశ్నించటం ప్రస్తుతానికి ఆపి రాజేశ్వర్ తల్లిదండ్రులతో మాట్లాడదాం గజనీ! శంక రనారాయణగారూ- మీ కొడుకూ కోడలూ ఎందుకిలా ప్రవర్తిస్తున్నారు? "

"వాళ్ళకు కన్నూ మిన్నూ కానరావటం లేదు- పెళ్ళాం మాటలు వినే ఆడంగివెధవ వాడు! కోడలు సరేసరి"

"ఈ పరిస్థితుల్లో మీరు మీ కొడుకు ఇంట్లోకాక వేరే ఉండవచ్చు కదా? "

"వేరే ఉంటాం- డబ్బివ్వమంటే ఇవ్వనం టున్నారు-"

"ఏమండీ రాజేశ్వర్‌గారూ! వాళ్ళకు డబ్బి వ్వకపోతే వేరే ఇంట్లో ఎలా ఉంటారు? "

"ఎవరివ్వనన్నారండీ! నెలకు ఇరవై వేలి స్తానని చెప్పాను. కానీ నెలకు డెబ్బయ్ వేలు ఇమ్మంటున్నారు-"

రాజేశ్వర్ తండ్రి విరుచుకు పడ్డాడు.

"డెబ్బయ్ వేలంటే ఎక్కువా? నేను సర్వీ స్‌లో ఉండగా సంపాదించిన జూబిలిహిల్స్ లో ఇల్లూ, పొలాలూ, ఫామ్ హౌస్‌లూ, బంగారం- వందకోట్ల సొమ్ము- ఏమయిపో యింది? నేను సంపాదించిన డబ్బుతో బ్రతికే హక్కు నాకు లేదా? "

"నీ ఆస్తెక్కడుందింకా? నీ దుబారాకే ఆరిపోయింది. చెల్లెలి పెళ్ళికోసం 70 కోట్లు ఖర్చుపెట్టిందెవరు? వాడెవడో స్వామిజీ వస్తే ఫామ్‌హౌస్‌లన్నీ రాసిచ్చేశారుకదా!"

"ఇంతకూ ఇప్పుడు మీరీ సమస్యకు పరి ష్కారం ఎలా ఉండాలనుకుంటున్నారు? "

"నెలకు డెబ్బయ్ వేలివ్వడానికి వాళ్ళొప్పు కుంటే మేం వేరేఇల్లు తీసుకొని ఉంటాం"

"ఛస్తే ఇవ్వను"

"ఇవ్వకపోతే కోర్ట్‌కెళ్తాం! నీ పరువు వీధిలోకీడుస్తాం!" అంది రాజేశ్వర్‌తల్లి..

ఇప్పుడో చిన్న బ్రేక్-

"తుగ్లక్ ఛానెల్లో అయిదేళ్లనుంచీ ధారా వాహికంగా వెలువడుతున్న 'కోడలా! నీకు గోరీ కడతా!' ప్రతిరోజూ చూడండి! సీరి యల్ ఆఖర్లో మేము వేసే ప్రశ్నకు సమా ధానం పంపి బంగారం గెల్చుకోండి.."

అంతలో ఒక ఆటో వచ్చి అపార్ట్‌మెంట్స్ ముందాగింది. అందులో నుంచి డెబ్భయ్ ఏళ్ళ జంట దిగింది.

వాళ్ళను వాచ్‌మెన్ తిన్నగా మా దగ్గ రకు తీసుకొచ్చాడు.

"అదే బాబూ- ఆ తుగ్లక్ ఛానెల్ శ్రీనివాస్ మా అబ్బాయే -వాడు రెండు గంటలనుంచీ కెమెరాముందు వాగుతోం దంతా విని ఉండబట్టలేక వచ్చాం"

వాళ్ళను చూడగానే అంతవరకూ తల్లి దండ్రులను బయటకు గెంటుతున్న కొడు కులు కోడళ్ళ గురించీ లెక్చర్ ఇస్తోన్న శ్రీని వాస్‌కి ఒక్కసారిగా మాటాగిపోయింది. మొఖంలో నెత్తురు చుక్కలేదు.

"గజనీ! అనివార్య కారణాలవల్ల కెమెరా స్విచాఫ్ చేయిస్తున్నా" అంటూంటే శంకర మూర్తి అడ్డుపడ్డాడు.

"ఇదిగో కెమెరామెన్నూ! మీ జర్నలిస్ట్ శ్రీనివాస్ తల్లిదండ్రులిక్కడికి ఎందుకొ చ్చారు, వాళ్లు ఏం చెప్పాలనుకుంటున్నారో- చెప్పాల్సిందే- కెమెరా స్విచాఫ్ చేస్తే దాన్ని పౌడర్ చేస్తాం" అన్నాడు .

కెమెరామెన్ కంగారుపడ్డాడు.

"కానీ కెమెరా ముందు మాట్లాడేందుకు శ్రీనివాస్ ఒప్పుకోవటం లేదు కదండీ!"

"అతను మాట్లాడకపోతే మేము మాట్లా డతాం" అంటూ శ్రీనివాస్ చేతిలో నుంచి మైక్ లాక్కున్నాడు విజయ్‌యాదవ్.

"గజనీ- నేను రామ్‌భరోసా అపార్ట్ మెంట్స్ నుంచీ విజయ్ యాదవ్‌ని మాట్లా డుతున్నాను- ఇప్పుడే మీ తుగ్లక్ టీవీ జర్న లిస్ట్ శ్రీనివాస్ తల్లిదండ్రులు ఇక్కడికొ చ్చారు- వాళ్ళు మీ ప్రేక్షకులకు కొన్ని విష యాలు చెప్పాలనుకుంటున్నారు గజనీ-"

"మా జర్నలిస్ట్ కాకుండా వేరే వాళ్ళతో మాట్లాడ్డానికీ, మాట్లాడించడానికీ మా ఛానెల్ రూల్స్ వప్పుకోవు విజయ్ యాదవ్-"

"గజనీ- మా అపార్ట్‌మెంట్ కొచ్చిన ఏ టీవీ ఛానెల్ అయినా మేము చెప్పినట్లు వినాల్సిందేనని మా సొసైటీ రూల్స్ ఉన్నాయ్! మీరు మా మాట వినకపోతే మీ కెమెరాను ధ్వంసంచేసే హక్కు మాకుంటుంది గజనీ- అంచేత అన్నిటికీ మేము రడీ- ఓవర్ టూ షైనీ-"

వెంటనే షైనీ మైక్ అందుకుని వారిని ఇంటర్‌వ్యూ చేయటం మొదలుపెట్టింది.

"మీరు శ్రీనివాస్ తల్లిదండ్రులా? ఇప్పుడి క్కడికి ఎందుకు రావాల్సి వచ్చింది? "

"ఎందుకేంటమ్మా! మా అబ్బాయ్ రెండు గంటలనుంచీ తల్లిదండ్రులను నిర్లక్ష్యం చేసిన కొడుకుల గురించీ, అత్తమామలను వెళ్ళగొట్టిన కోడళ్ళ గురించి నిప్పులు చెరు గుతున్నాడు- వాడి చెత్తవాగుడు చూసి ఇంక ఉండబట్టలేక ఇక్కడికొచ్చాం!"

"ఇంతకూ మీరేం చెప్పదల్చుకున్నారు? "

"టీచరు ఉద్యోగం చేసుకుంటూ నానా అవస్థలూపడి వీడిని పెంచాను, ఈ వృద్ధా ప్యంలో మమ్మల్ని కనిపెట్టి ఉంటాడని ఆశపడ్డాం! కానీ పెళ్ళాం మాట విని మ మ్మల్ని ఇంటినుంచి గెంటాడు. నెలకు అయిదొందలిస్తాను- ఎక్కడైనా ఛావండి- అన్నాడు. మేము మాకొచ్చే అరకొర పెన్ష న్‌తో నానా చావూ ఛస్తూ తోడూనీడా లేకుండా గడుపుతున్నాం! డబ్బు చాలక నేను ఈ వయసులో వాచ్‌మెన్ ఉద్యోగం చేస్తున్నాను. నా భార్య నాలుగిళ్ళలో అంట్లుతోముతోంది. ఇలాంటి వీడు టీవీలో తల్లీతండ్రీ ప్రత్యక్షదైవాలు అంటుంటే నరికి పారేయాలన్నంత కోపం వచ్చింది"

అందరూ స్టన్ అయిపోయారు.

అప్పుడే తుగ్లక్ ఛానెల్‌లో కింద స్క్రోల్ అవుతున్న 'బ్రేకింగ్‌న్యూస్' కనిపించింది.

"తుగ్లక్ టీవీ న్యూస్‌రీడర్ గజనీ అత్త మామల ఆత్మహత్య"

©

కరువు కరాళ నృత్యంచేస్తూ విధ్వంసాన్ని సృష్టిస్తుంటే భూమినే నమ్ముకుని బతికే బక్కరైతుల జీవన చిత్రంలోని విషాదమెలాంటిది? పరువుగా బతికే కుటుంబాలు సైతం బతుకు పోరాటంలో దారిద్ర్యదేవత రథచక్రాల కింద చిక్కి ఎలా శల్యమైపోతాయి? రేనాడు ప్రాంతంలోని గ్రామాల గతవైభవంతో పోల్చుకుంటే ప్రస్తుతమున్న సంక్షోభం ఎలాంటి విపరిమాణాలకు దారితీస్తోంది? మనుషులుగా మనం కోల్పోతున్నదేమిటి? దేశానికి పట్టుగొమ్మలైన పల్లెల దుస్థితిని విభిన్న పార్శ్వాల్లో కవితాత్మకంగా కళ్లకుకట్టిన వేంపల్లి గంగాధర్ నవల **నేల దిగిన వాన** ఈ నెల చతుర సమర్పణ



-వేంపల్లి గంగాధర్

జాలి లేని ఆకాశం నుంచి ఒకానొక సుదీర్ఘ సంఘర్షణ తర్వాత రాతి వాసన వేస్తున్న మట్టి రైతును మొలిపించడం కోసం
చినుకు...
నేలకు దూకుతుంది
చెరువు ఒడిని ఆకాశమంత నింపడానికి!
నాగరికతలు నీళ్లతోనే ప్రవహిస్తాయి
చరిత్రలు యేటి అలలే రాస్తాయి.

## 2

పెద్దబ్బా...
ఈ పాడు వాన ఎప్పటికి కురుస్తాదోనని
ఎందుకు ఎదురు చూస్తావు?
మేఘాలన్నీ భళ్ళున విరిగి కరిగి
నేల నేలంతా నీరై పాకే శబ్దం కోసం
ఎంత కాలం నిరీక్షిస్తావు...?

## 3

హిరణ్యం...
హిరణ్య రాజ్యం...
హిరణ్యమంటే బంగారం
ఇది బంగారం పండే నేల
రత్నాలు రాశులు పోసి అమ్మిన వజ్రాల గడ్డ
ఈ బంగారు నేలమీద జన్మిస్తే చాలు
వెయ్యి జన్మల తపస్సు ఫలించేది.
నిత్యం అవే సూర్యోదయాలూ...
అవే సూర్యాస్తమయాలే... అయినా ఇక్కడి రైతుల జీవితం నిత్య నూతనంగా.. కాంతిమంతంగా వెలిగేది.
ఇక్కడి నేలంటే రైతుకు ప్రాణం.
రైతంటే నేల తల్లికి ఇష్టం. ఇక్కడ పంచభూతాలు పరవశించేవి.
ఆ నింగీ... నేలా... నిప్పు... గాలీ... నీరూ... పరిమళించేవి.

రైతు కంట్లో కన్నీరు చిందితే రాజ్యానికి అరిష్టం.

రైతుకు రవ్వంత కష్టం కూడా రాకుండా చూసేవి.

రైతును గుండెలో పెట్టుకొని చూస్కొనేవి.

ఆరోజుల్లో...

ఆ బంగారు కాలాల్లో

రైతు రాజుగా లోకాలు ఏలే కాలాల్లో...

మట్టిమిద్దె వసారాలో దూలానికి జొన్న కంకుల గుత్తి తగిలించి తను పండించిన పంట వైభవాన్ని ప్రదర్శించే గంభీర కాలాల్లో...

ఊరపిచ్చుకలు కిలకిలరావాల శబ్దం చేసుకుంటూ వసారాలో కట్టిన జొన్నకంకుల్ని పొడుచుకొని తింటూ వుండే ప్రశస్తమైన శుభ ఘడియల్లో...

భూమి మీద ఆకాశానికి ప్రేమపండే తరుణాల్లో...

మబ్బులన్నీ సలాం చేస్తూ నేల తల్లిని ప్రార్థించే సమయాల్లో...

విత్తనం పచ్చని విశ్వరూపం చూపిస్తూ ప్రకృతికి పందిరేసే వేళల్లో...

ఒక ప్రాచీన నాగరికతకు ప్రతీకలా...

శాఖోపశాఖలుగా వ్యాప్తమై... పరివ్యాప్తమై...

ఒక హరిత లోకమై... అణువంత విత్తనం విస్తరించి...

అరణ్యమై... మహారణ్యమై... బంగారం పండే నేలగా...

ఈ హిరణ్యరాజ్యం ఎలా వుండేది...

నదీ నదాల్లో... కందకాల్లో...

కంచెల్లో... కొండకోనల్లో... కీకారణ్యాల్లో...

జాజిపూల జలపాతాల్లో... హిరణ్యరాజ్య వీధుల్లో... ప్రతి ప్రాతఃకాలం ఎరుపెక్కిన గుండెలతో ఆకాశం నుంచి అరుణోదయ ఆవిష్కారం... వేయి వెలుగుల జ్యోతిలా... విశ్వాత్మ విశ్వరూపం... చరాచర జగత్తు వేకువకాంతుల్ని వీక్షించే

తరుణం... ఒక పురాతన పరిణామం!

ఇక్కడ ప్రవహించే నదికి పాడేందుకు వొక పాట వుంది. కొండకు, కోనకు చెప్పేంత చరిత్ర వుంది. వినిపించేంత కథ వుంది. దురదృష్టంకొద్దీ అవి మాట్లాడ లేవు. పాడలేవు. విన్పించలేవు. నేడు హిరణ్యా రాజ్యం ఎలా మారింది...?

నెర్రెలు చీలిన నేల.. కరువు విధ్వంసం...

మోడైన చెట్లు రాల్చే కన్నీళ్లు...

వట్టిపోయిన ఆకాశం...

ఎండిపోయిన నేల...

పిడచకట్టుక పోయిన గొంతులు... నేల లోతుల్లోకి ఎన్ని అడుగులు లోపలికెళ్ళినా నీటి జాడలేదు. నీటిజాలు లేదు. దాహం... దాహం... దాహం...

గొంతెత్తి ప్రార్థించినా... చేతులు జోడించి పూజించినా... అదంతా గొంతు తడవడానికే... నేలతల్లి గుండె తడవడా నికే కదా! పడమటి దిక్కున వరద గూడు కోసం కళ్ళు చూసి చూసి విసిగిపోతా వుండాయి. భరోసా లేని బతుకయ్యి పోయింది...ఎండిన బీళ్ళ మధ్య పచ్చటి ఇగుళ్ళ కోసం రైతులు ప్రాణాలు పణంగా పెడతావుండారు. వట్టిపోయిన బావులు... బోర్లు... ఎండిపోయిన చెరువులు... కుంటలు... కాల్వలు, అడుగంటిన భూగ ర్భజలం... వెరిసి నలుగురికీ పట్టెడన్నం పెట్టే అన్నదాత నోట్లో మట్టికొట్టాయి. మట్టిశాపం... రైతు బతుకులో అలజడి... తడి...

నీరై... నిశీధి కన్నీరై... నిబిడాంధకా రపు హోరై... నీరవ నిశ్చేష్టాదృష్ట నీహా రికా ధారై...

కరిగి... కరిగి... అరిగి... అరిగి... నలిగి... రగిలి...

పగిలి... గుండె పగిలి... దోసిట్లో కన్నీటి ప్రవాహమై... ఒక దుఃఖ గీతమై... విషాదశోకమై... ఆలపించే ఈ నేల ఘోష...!

హిరణ్యా రాజ్యం... దీనికి మరో పేరే రేనాడు...

రేనాడు రాజ్యం... చరిత్ర పుటల్లో చెర గని కీర్తి శిఖరం... రేనాటి సీమ...మబ్బు కరగని సీమ... సేద్యం చట్టుబండలై ఇనుప గజ్జల తల్లి నాట్యం చేసే వట్టిళ్ళ లోగిలి సీమ... నారు పోసినోడు నీరు పొయ్యలేని సీమ... కరువు సీమ... వ్యవ సాయ కూలీలుగా కూడా బతకలేని దుర్భర దారిద్ర్యం మనుషుల్ని నగరాలకు, ఫ్యాక్టరీలకు తరిమేస్తుండే ఒకానొక హృద య విదారక దృశ్యం. క్షణం తీరిక లేదు. దమ్మిడీ ఆదాయం లేదు. చాలీచాలని బతుకులు. ఇప్పటి నుంచి కాదు... ఎప్ప ట్నుంచో... వేలాది సంవత్సరాలు... లెక్క లేనన్ని తరాలు... కరికాల చోళుడి కాలం... వాళ్ళతోనే వచ్చింది ఆ పేరు... అదే 'రేనాడు'. రేనాటి చోళులు నడిచిన నేల... ఏలిన నేల... పాలించిన నేల... మూడు తాలూకాలు.. కమలాపురం... ప్రొద్దుటూరు... జమ్మలమడుగు... కర్నూ లులోని కోయిలకుంట్ల తాలూకాలోని కొన్ని భాగాలు... కలిపి ఏడువేల గ్రామాలుండే మండలం... ఇన్నుంటే తూర్పుకు రాజం పేట తాలూకా పొత్తపడికాడికి. పడమట కర్నాటకలోని తుంకూరు జిల్లా పావుగడ తాలూకాలోని నిడిగల్లు, ఎరిగల్‌వాడి వైపుకు...! ఇదంతా రేనాడు. దీనికి ఒకానొక రాజు కరికాల చోళుడు. రేనాటి చోళుడు- రాజులకే రాజు- రారాజు. వీరాధి వీరుడు. కొట్టురా తొడ, తిప్పురా మీసం. ఎండిపోతాండే పొలాలు... నీళ్ళ కోసం పడిచస్తాండే బీడు భూములు... ఆకులు రాలిపోయి అల్లాడుతుండే చెట్లు... చేమలు... గింజలు కూడా లేకుండా దు ఖ్ఖించే రైతులు... డొక్కలెండి పోతాండే

జీవాలు... భయంకర దృశ్యం! యాడ చూసినాడు...? ఏంజేసినాడు...? ఎంత పనికి పూనుకున్నాడు... పైపైన పోతాండే కావేరి నదికి కళ్ళెం వేయాలని జూసినాడు. నదిని తిప్పుకుంటే నాగరికత నిర్మాణ మౌతుందని కల కన్నాడు. నీళ్ళకోసం పరి తపించాడు. నీళ్ళు తిప్పుకుంటే రేనాడులో రత్నాలు పండుతాయి. వజ్రాలు మొలకె త్తుతాయి. హారాల లెఖ్ఖన గింజలు విర గకాస్తాయి. రైతుల కడుపులు నిండు తాయి. జీవాల డొక్కల్లో జీవం నిండు తాది. జనం కోసం... జనంలో జీవం కోసం... జీవజలం కావాలి... జలం... జలం... సాగిపోతండే కావేరిని మళ్ళించు కోవాలి. పైన పోతాండే జలమాతకు పగ్గా లేసి రేనాటి దిక్కుకు పారించుకోవాలి... పాలించుకోవాలి. సాగించుకోవాలి... సాగులు చేసుకోవాలి... ఎన్నెన్ని కలలు కన్నాడు. సాధ్యం కాలేదు. శత్రువైనా లొంగుతాడు గానీ నది లొంగుతుందా? అందుకే పెన్నమ్మ... పెన్నానదీ మాతను నమ్ముకున్నాడు. ఆ తల్లి స్వర్ణయుగం చూపించింది. కమలాపురం తాలూకా పెద్ద చప్పలి రాజధానిగా పరిపాలన సాగింది.

ఈ హిరణ్య ప్రాంతంలో రైతులు సింహాల్లాగా బతికినారు. రైతులంటే 'మేమే' అనేటట్లు మీసాలు తిప్పుకొని తిరి గినారు.

తోకను వీపుపైన చుట్టు తిప్పి ఎడమ వైపు నిలబడిన అసమాన పౌరుష, పరాక్ర మాలను చాటే సింహము రేనాటి చోళుల రాజలాంఛనమైంది.

వీరి మొదటి శాసనం కలమళ్ళ గ్రామంలో వేయించినారు. 'ఎరికల్ ముత్తురాజు' బిరుదముతో ధనుంజయ వర్మ వేయించిన మొదటి తెలుగు శాసన మిదే! ఇది ఆరవ శతాబ్దం నాటిది.

ప్రొద్దుటూరు దగ్గర పెన్నానది ఒడ్డున రామేశ్వర ఆలయాన్ని 'పోర్ముఖ రామ' బిరుదుతో పుణ్యకుమారుడు నిర్మించాడు.

అత్తిరాల దగ్గరి త్రేతేశ్వరాలయం కూడా రేనాటి చోళులే నిర్మించారు.

ఈ రేనాటి ప్రాంతాన్నే ప్రాచీన కాలంలో మహారాజవాడి, మార్జవాడి అని కూడా పిల్చినారు. జనాల్లో నిలబడిన పేరు మాత్రం 'హిరణ్య రాజ్యమే'.

★ ★ ★

ప్రియురాలు ముంతాజ్ కోసం పాల రాతి సమాధి కట్టించడానికి షాజహాన్ వుండాడు... చెట్టు నుంచి రాలిపడే ఆపిల్ కాయను చూడడానికి న్యూటన్ వుండాడు... రాజుగారి కిరీటం బరువును స్నానాల గదిలో కనుక్కోవడానికి ఆర్కిమె డిస్ వుండాడు... జిరాఫీ మెడ ఎందుకం తగా సాగిందో విశ్లేషించడానికి డార్విన్ వుండాడు... ఆడపిల్లలవైపే అబ్బాయిలం దరూ ఆశగా ఎందుకలా చూస్తారో చెప్ప డానికి ఫ్రాయిడ్ వుండాడు... బ్రిటిష్‌వా రిని క్విట్ ఇండియా పేరుతో తరమడానికి మహాత్ముడుండాడు.. వీళ్ళందరి గురించి మాకెందుకు...?

ముసిల్ది కట్టించిన సద్దిమూట భుజాన వేసుకొని చిరుగుల చొక్కా తొడుక్కొని జీవాల్ని తోలుకుంటూ ప్రతిరోజూ సూర్యో దయాన్ని చూడడం... ఎండిపోయిన చెరువు గట్టున మోడువారిన వేపచెట్టు నీడలో ఎర్రకారంతో మధ్యాహ్నన కడుపు నింపుకోవడం... ఇలాగే మా నాన్న చేసే వాడు... వాళ్ళ నాన్న చేసేవాడు... ఇప్పుడు నేను చేస్తున్నాను. రేపు నా కొడుకు చేస్తాడు. మేమిలా అజ్ఞాతవాసం లోనే వుండిపోతాం... మమ్మల్ని ఏ కొలం బస్ కనిపెట్టలేడు... మా కరువు చెరు వును ఏ వాస్కోడిగామా గుర్తించలడు...

ఇక్కడ మనిషొకటి తలిస్తే, విధి మరో

# గుండుసూది నుంచి రైలుబండిదాకా..




ఒకసారి దక్షిణాఫ్రికాలో మహాత్మాగాంధీ ఓడ ప్రయాణం చేస్తున్నారు. ఆయనను విమర్శిస్తూ తాను రాసిన సుదీర్ఘ రచనను ఓ ఆంగ్లేయుడు ఇచ్చాడు. గాంధీజీ దానిని పైపైన చూసి, కాగితాలకు గుచ్చిన గుండుసూదిని మాత్రం పెట్టెలో భద్రపరచారు. కాగితాలను అక్కడే పడవేశారు.



"గాంధీ! వాటిని చదవండి. అవి చాలా ముఖ్య విషయాలు" అన్నాడతను.

"మీరేమీ బాధపడకండి. ముఖ్యమైన దానిని ఇప్పటికే భద్రపరిచాను" అంటూ బదులిచ్చారాయన.

## కందిరీగ భాష

సుప్రసిద్ధ నిఘంటుకర్త డాక్టరు జాన్సన్‌ను ఒక చేపలు పట్టే స్త్రీ దుర్భాషలాడింది. అటువంటి వాటిని తిరిగి ఆమెపై ప్రయోగించలేని ఆయన తీవ్ర స్వరంతో ఇలా అన్నారట. "నువ్వొక నామవాచకానివి. విశేషణానివి, క్రియా విశేషణానివి.."

ఆ మత్స్యభామినికి అక్షరం ముక్కరాదు. ఆ మాటలన్నీ కందిరీగల్లా గుచ్చుతున్నట్లు భావించి "అమ్మలారా అయ్యలారా, ఆ పెద్ద మనిషి నన్ను ఎట్లా తిడుతున్నాడో చూడండి" అంటూ వాపోయిందిట.

## సాలీడు శకునం

మార్క్‌ట్వైన్ మిస్సోరి నుంచి పత్రిక తెస్తున్న రోజులలో ఒక పాఠకుడు వ్యంగ్యంగా ఇలా రాశాడు. "నాకు పత్రికలో సాలీడు కనిపించింది. ఇది శుభ సూచకమా, అశుభ సూచకమా?"



అందుకు ఆయన ఇచ్చిన జవాబు "మా పత్రికలో సాలెపురుగు కనిపించడం శుభశకునం కాదు, అశుభమూ కాదు. నిజానికి సాలీడు మా పత్రికను చూస్తోంది.. ఏ వ్యాపారీ ప్రకటన ఇవ్వలేదా అని మాత్రమే. అలా ప్రకటన ఇవ్వని వ్యాపార సంస్థను చేరుకొని తలుపులకు అడ్డంగా గూడుకట్టుకొని సుఖంగా కాలం గడుపుదామని అది భావిస్తోందేమో.."

## గులాబి-ముళ్లు



ఆంగ్ల కవీశ్వరుడు జాన్‌మిల్టన్ అంధత్వం ప్రాప్తించగానే ఒక స్త్రీని వివాహం చేసుకున్నారు. అయితే ఆమె గయ్యాళిగా తయారయింది. కానీ, ఆయన స్నేహితుడైన డ్యూక్ ఆఫ్ బకింగ్‌హామ్ ఆమెను 'గులాబి' అని పిలిచేవారు. మిల్టన్ పరిహాస పూర్వకంగా వ్యాఖ్యానిస్తూ "నేను రంగులకు సంబంధించిన నిర్ణేతను కాను. మరి నీవన్నది నిజమేనేమో. ప్రతిరోజూ ముళ్లస్పర్శ అనుభవిస్తున్నాను" అన్నారు.

## ఆ విధంగా ముందుకు



ఒకసారి బ్రిటిష్ రాజనీతివేత్త విన్‌స్టన్ చర్చిల్ రైలు తప్పిపోయారు. అందుకు ఆయన సతీమణి బాగా కలవరపడ్డారు. అప్పుడు చర్చిల్ ఆంతరంగిక కార్యదర్శి ఆమెను ఊరడించేందుకు ప్రయత్నిస్తూ చెప్పాడు. "విన్‌స్టన్ ఎంతో గొప్పవారు. ఆయన ఎప్పుడూ ముందుకు వెళ్లేందుకే రైలుకు అవకాశం ఇస్తారు."

కటి తలుస్తుంటుంది.

అందుకే మా ఊర్ని ప్రపంచపటం నుంచే బహిష్కరించినట్లుంటాది...

ప్రపంచమంటే నగరాలు... పట్టణాలు మాత్రమే కాదు. కొండల్లో... లోయల్లో... అడవుల్లో... అనాగరికులు కూడా ఎంతో మంది వున్నారు. వాళ్ళ జీవితాలు ఎలా వున్నాయి?

ఒకపూట తిండి గింజలు కూడా దొరక్క ఆకలి చావులు చచ్చిన వాళ్ళు...

అప్పుల బాధలకు తాళలేక ఆత్మహత్యలు చేసుకున్నవాళ్ళు...

నేల తల్లిని నమ్ముకొని కరువు కుంపటి నెత్తికెత్తుకున్నవాళ్లు...

పొట్ట గడుపుకోవడానికి పూనా వ్యభిచార గృహాలకు అమ్ముడైన అమ్మాయిలు...

కల్తీ విత్తనాల మోసం... గిట్టుబాటు ధర కూడా రాక నిరాశ... ఇలా ఎందరో జీవితాలు ఒక ఆట... ఎప్పుడు ముగిసిపోతుందో తెలియని ఈ నాటకం పేరే జీవితమా...!

మా జీవితాలు అపశ్రుతులు
మా జీవితాలు వక్రరేఖలు
మా జీవితాలు తీరని శాపాలు
ఎందుకో తెలుసా?

మేము ఆకాశం నుంచి చినుకుల కోసం ఎదురు చూసేవాళ్ళం!

ఇదిగో మా ఊర్లోకి వస్తున్నారా! అయితే పెన్నమ్మకు నిండుగా మదిలోనే నమస్కారాలు చేసుకొని నాతో రండి...

ఇలాగే... ఈ కాలిదోవ వెంబడే... ఈయేటి గట్టుమీద వుండే శాసనం సూడండి...

ఏమని చెక్కినారు...? ఎండకు ఎండి... వానలకు తడిసి అక్షరాలు కన్పించడం లేదుకదూ...!

"ఈ యేరు సాగనియ్యక యవ్వండు ఖిలం సేసును, ఈ ధర్మమునకు యవ్వరు తప్పినాను... తమ తల్లితండ్రుల వారణాశిన కుతికలు కోసిన పాపాలపోదురు. గంగావతిలోను గంగెవును చంపిన పాపాన పోదురు. శుణుక మాంసం సుర శేవించిన పాపాన పోదురు. పంచమహాపాతక సంయుక్తుండగును"

ఇది శాసనం.

యేరును ఎవరూ అడ్డుకోకుండా రేనాటి రాజులు వేసిన శాసనమిది.

ఇప్పుడు యేరుని ఎవరూ అడ్డుకోలేరు. పెన్నమ్మ ఎండిపోయింది. మా ముఖాన కరువును కొట్టి తన దారిన తాను పోయింది. ఇప్పుడు నది లేదు... నదిలో తడిలేదు... శాసనం మాత్రం వుండాది, యేటి గట్టున అక్రమంగా ఇసుకను తరలిస్తున్న ట్రాక్టర్లను చూస్తూ!

4



**న**డిరాత్రి ఉలిక్కిపడి కలవరంలోంచి మేల్కొని జూసుకుంటి. ఒళ్ళంతా చమటలు పట్టి వుండాయి. తెల్లారితే శ్రీరామనవమి. ఒంటిమిట్టకు పోవాల. పోయి గెల్సాల. గెల్సి సూపియ్యాల. ఆడ్నె కోదండ రాముడు వుండాడు గుడిలో. ఆ సామీ మహత్యం సూపీకపోతాడా... నన్ను అప్పుల్లోంచి గడ్డకేయకపోతాడా... నా కుటుంబాన్ని కాపాడకపోతాడా... తుండుగుడ్డతో చమట తుడుసుకుంటా

లేస్తి. గాట్లోకి పోయి ఎద్దుల్ని చూసు కుంటి.

మామూలుగైతే ఎప్పుడూ యింతగా దుఃఖపడింది లేదు. కానీ నీలకంఠం గుర్తుకొస్తే రొంచెపు యాడలేని తనకలాటై తాది గుండెలో.

ఏంచేసి సచ్చేది?

గతిలేక ఊర్లో అప్పుజేసిన పాపానికి ఆ పాయికారి నాయాల్తో మాటలు పడాల్సి వచ్చె. ఎట్టైనా గానీ వాడి బాకీ తీర్చాల. దుడ్లమూటే వాడి ముఖానా యిసిరి కొట్టాల. తాకట్టులో వుండే భూమి యిడి పించుకోవాల. అయినా నేనేం జేసేది?

నమ్ముకున్న నేల నిట్టనిలువునా ముంచుతాదని ఎప్పుడు కలగంటి?

పోసిన గింజలు పోసినట్లు ఒట్టి పోతాంటే పచ్చని పైరు ఎట్టా లేస్తాది?

ఈ ఆకాశం రవ్వంతైనా జాలి జూపి స్తాంటే కదా! నాలుగు సినుకులు కురిపిస్తే నలబై పుట్ల ఒడ్లు రాశిపోసే నా కొడుకుని.

ఏదీ చినుకు రాలిందేది?

పెట్టిన పెట్టుబడి గూడా రాకుండా మానాల్ని, ప్రాణాల్ని కూడా పణంగా పెట్టి ఆడతాండమే ఈ జూదం, ఆ నేల తల్లికి తెల్సి సస్తాందా?

ఆ మోడాలకు అర్థమైతాందా?

ఎప్పుడూ మూగిమీదేసుకొని ఏం ఎరగ నట్లు వుండడమే తప్ప దాన్లకేం తెలుసు?

మా యబ్బకాలంలో ఊర్లోనే పెద్ద రైతులం.

మా కింద ఎందర్నో బతికించేటోళ్ళం. సేయి సాచి అడిగినోళ్ళకు లేదనకుండా పుట్లు పుట్లు దానమిచ్చేటోళ్ళం.

పోయింది... పోయింది...

ఆ వైభోగమంతా పోయింది...

ఇదే ఈ నేలే... ఈ భూమే... ఈ గడ్డనే...

మా జీవితాల్ని మింగింది.

ఎట్లా బతికినోళ్ళం...

ఎట్లా బతుకుతాండం...

ఈ దినం యింగోడి దగ్గరికి కూలీగా ఏంటికి పోవాల్సివస్తాంది?

వద్దు... వద్దు... ఈ జీవితం వద్దు...

భయంతో... చమట కారిపోతాంది... ఒంట్లో సన్నని అలజడి... గెల్సాల... గెల్సితీరాల...

ఎద్దులు బాగుండాయి... నా జాతకమే బాగాలేదు...

దగ్గరకిపోయి ఎద్దుల్ని తడిమి సూసు కుంటి.

గుండెకేదో హాయి. రవ్వంత ప్రశాం తత.

పందెంలో ఓడిపోకుండా గెల్సాల.

గెల్సి నన్ను నా జీవితాన్ని నిలబెట్టాల.

ఎద్దులు మెడ విదిల్చాయి. గంటలు గుళ్ళో మోగినట్లు సవ్వడి జేసినాయి.

అయినా గుళ్ళో శ్రీరాములోరు వుండారు.

సామి గెలిపీక పోతాడా...

ఏం గెలిపిస్తాడో ఏమో...

ఊర్లో వాళ్ళు ఏందో అన్నారని మహా తల్లి సీతమ్మ గారినే అడవులకు పంపి నోడు...

అయినా ఆయన్ను దేవుడనే అన్నారు కదా!

అవన్నీ నాకెందుకు? రేపు బండలా గుడు పోటీల్లో నా ఎద్దుల గెల్సాల.

అది సాలు సామీ!

నా కడుపుకు తిన్నా, తినకున్నా

ఎద్దుల్ని పోషించుకుంటా వుండాను. ఒక్కొక్క దానికి దిన్నం మూడు కేజీల ఉలవలు, పది కేజీల జొన్నలు, రెండు కేజీల రాగులు, ఆదివారాలప్పుడు మసాల పెట్టిన మాంసం ముద్దలు, కోడిగుడ్లు, నూగులపిండి పెట్టి పెంచుతాండను. రేత్తి రిపూట దిన్నం అరటిపండ్లు, తమలపా

కులు కూడా.

ఎన్ని పెట్టినా ఎద్దులు పచ్చి జొన్నగడ్డి అంటే ఇష్టంగా తింటాయి.

బాగుండే రోజుల్లో బాగా పంటలు పండేటప్పుడు, వానలు సరిగ్గా కురిసే రోజుల్లో అన్నీ సమకూర్చి పెట్టెటోన్ని. ఇప్పుడు కూడా ఇట్నే సాకాలంటే నాకు యాడైతాది. దీన్ల పోషణకే సగం అప్పులై నాయి. మిగతా సగం భూమి తల్లి మింగింది. పచ్చగడ్డి యాడలేస్తాది... జొన్నగడ్డి... ఎట్లవస్తాది... యాన్నుంచి వస్తాది...

ఎద్దుల్ని నిమిరి చూసుకుంటి.

నా రెండు కళ్ళు- పంచప్రాణాలు- నా ఎద్దులు.

పొలంలోకి దిగినాయంటే రోజుకు ఆరేడు ఎకరాలు సునాయాసంగా దున్నే స్తాయి. నాలుగు టన్నుల బరువైనా అవ లీలగా లాగిపారేస్తాయి.

బండ లాగుడు పోటీల్లో ఎంతటి బరు వైన రాతి దూలాన్ని అయినా ఈడ్సి నా పరువును నిలబెడతాయి.

ఆ నమ్మకం నాకుంది.

కాకపోతే నిన్న సాయంత్రం పొలంకాడ వలపట ఎద్దు వీపుమీద కాకి వాలి వుండడం జూస్తి. దగ్గరికి పోయి పరిశీలన జేస్తి. పుండు ఏదో లేసుంది. అప్పటిక ప్పుడు యాపాకు నూరి పసురు చేసి పట్టించాను. అదే రొంత దిగాలుగుంది. అయినా పోతిరెడ్డిపల్లెకాన్నుంచి సదాశివా రెడ్డి ఎద్దులుగాని రాకుంటే బాగుండుననిపి స్తాంది. కాస్త అటిట్లైనా ఆ ఎద్దులు రంగంలో నిలబడగలవు. అదే కొంచెం భయంగానూ వుంది. ఆ మధ్యన నంద లూరు మండలం టంగుటూరు కాడ శ్రీహ రజత్ ఖాదర్‌వలి ఉరుసునాడు జరిపిచ్చిన బండలాగుడు పోటీలు ఎట్టెట్ట జరిగి నాయి... అనుకుంటే చాలు కాళ్ళూ, చేతులూ వణికిపోతాయి... చిట్టచివర్న ఆఖరిదశలో పోతిరెడ్డిపల్లె ఎద్దులు తగ్గి నాయి కాబట్టి సరిపోయింది. లేకుంటే మొదటి బహుమతి నాకు ఎక్కడొచ్చివుం డేది?

మళ్ళీ ఇప్పుడు అట్టాటి పరిస్థితే రాదు కదా! పైగా వలపట ఎద్దు అంత ఆరోగ్యం గానూ కన్పించడంలేదు. ఎద్దుపుండు గురించే ఆలోచిస్తుండాను. సూసి సూసి ఈ ఎద్దుల్ని అమ్ముకోవడం కూడా నాకిష్ట ముండదు. మా నాయన ఎంత కష్టపడి ఈ ఎద్దుల్ని కొన్నాడు. నేను పిల్లోడప్పుడు సేద్యం కోసం పులివెందుల సంతలో కొన్న ఎద్దులు.

మా నాయన రామిరెడ్డి.

మీసాలు దువ్వుకుంటూ బతికినోడు.

రామిరెడ్డి పంచాయితీకి వచ్చినాడంటే ఎట్టాటి సమస్య అయినా పరిష్కారమైపో యేది.

సీతాపురం కాన్నుంచి దిగువ గుట్టపల్లె కాడికి, ముదిరెడ్డిపల్లెకాన్నుంచి గండ్లూరు కాడికి వుండే భూములన్నీ సాగు చేసుకో మ్మని ప్రజలకు దానమిచ్చిన ధర్మదాత. ఆయన ఇష్టపడి కొన్న ఎద్దులు. సేద్యం పనులన్నీ ఒంటి చేత్తో జరిగిపోయేవి. దాన్లమీద పెట్టిన శ్రద్ధ కారణంగా అవి బాగా పుంజుకున్నాయి. శరీరం పెరిగింది. కండలు తిరిగినాయి. పోటీలకు తయారై నాయి. అప్పట్నుంచి అటు పొలం పను లకు, ఇటు పోటీలకు ఈ ఎద్దులే ఉపయో గపడతాండయి. కార్తీక మాసంలో ప్రొద్దు టూరి దగ్గరి రామేశ్వరంలో మొదటిసారి బండలాగుడు పోటీల్లో నెగ్గినాయి. పది వేల నూటా పదార్లు గెల్సినాయి. అప్ప ట్నుంచి దీన్లను ప్రాణం లెఖ్ఖన చూసుకుంటా వుంటిమి. వానలు పడక... కరువు కమ్ముకున్నాక.... భూములు మోసం జేయడం నేర్చుకున్నాక... పండిన

# ముద్దాయి నిజాయితీ




కాలిఫోర్నియాలోని 'మోడెస్టో' అనే ఊరిలో డెబీ విట్‌లాక్(32) 1998 మార్చిలో బలాత్కారానికి గురయి, హతురాలైంది. ఆమెను గొంతుకోసి చంపారు. ఆమె తల్లి 59 ఏళ్ల జాక్ యూ ఆ హంతకుడ్ని ఎలాగైనా పట్టుకోవాలని కంకణం కట్టుకుంది. ఏటా డెబీ మరణించిన రోజున స్థానిక దినపత్రికల్లో ఆ హంతకుడి వివరాలు తెలిపినవారికి పదివేల డాలర్ల బహుమతినిస్తానని ప్రకటిస్తూ వచ్చింది. రోడ్డు పక్కన హోర్డింగుల మీద కూడా ప్రకటనలు వేసింది. అంతేకాక




కరపత్రాలను కూడా పిజ్జాహట్, పచారీ దుకాణాల్లో ప్రజలకు అందుబాటులో ఉంచసాగింది. యాభైకిపైగా టీవీ షోల్లో కూడా పాల్గొని, డెబీ హంతకుడిని తన తప్పు ఒప్పుకోమని కోరింది. డబ్బుకోసం ఆశపడి అనేక మంది ఇచ్చిన ఆచూకీలను కూడా ఆమె డిటెక్టివ్‌ల ద్వారా పరిశోధన చేయించిందికాని, ఉపయోగం లేకపోయింది.

తన కూతురు మరణించిన మూడేళ్లకు 'అమెరికాస్ మోస్ట్‌వాంటెడ్' అనే టీవీ షోలో, ఆరేళ్ల తర్వాత 'అన్‌సాల్వ్‌డ్ మిస్టరీస్' అనే టీవీ షోలో కూడా జాక్‌యూ పాల్గొంది. డెబీ హంతకుడికి శిక్షపడేదాకా తనకి ఊరట కలగదని ప్రేక్షకులకు చెప్పింది.

బ్రిటన్‌లో పుట్టి, మాక్‌డొనాల్డ్ అనే పైలట్‌ను వివాహం చేసుకుని అమెరికాకు వలస వచ్చిన జాక్‌యూకు ఈ విషయంలో భర్త సహకారం కూడా లభించింది. ఏటా తన కూతురు సమాధిని దర్శించినప్పుడల్లా, హంతకుడిని పట్టుకోవాలన్న ఆమె కోరిక ఇనుమడించసాగింది.

ఫ్యాక్టరీ కార్మికుడు స్కాట్ ఏవరి ఫిజెల్(27) ఆర్కాన్సాస్ రాష్ట్రంలోని ఫ్లిపిన్ అనే ఊరిలో 2007 జనవరి 7న పోలీసు స్టేషన్‌లోకి వెళ్లి, తనే డెబీని బలాత్కరించి చంపానని, మనస్సాక్షి తనను ఇబ్బంది పెడుతోందని ఒప్పుకున్నాడు. డెబీని కోల్పోయిన ఆమె తల్లి తనను కనుగొనేందుకు పడే తపనను గమనించాక, తన తప్పుని ఒప్పుకునేదాకా తన అంతరాత్మ ఊరుకోలేదని అతను తన వాంగ్మూలంలో పేర్కొన్నాడు.

అయితే పోలీసులు మొదట ఆ వాంగ్మూలాన్ని నమ్మలేదు. కానీ సరిగ్గా డెబీ మరణించిన రోజునే స్కాట్ మోడెస్టో పోలీసు శాఖ సార్జెంటుకు తన వివరాలు చెప్పాడు. అతడి నేరాలు రుజువయితే మరణశిక్ష పడే అవకాశం ఉంది.

'ఈరోజు నుంచి ఈ లోకంలో ఇద్దరు నిశ్చింతగా నిద్రపోతారు. ఒకరు జాక్‌యూ. మరొకరు నేను' అని ముద్దాయి స్కాట్ విలేఖరులకు చెప్పాడు.

గింజలకు కూడా గిట్టుబాటు ధర రాకుండా దళారులు మోస్తుండటం చూళ్లేక... వ్యవసాయం మానుకోలేక... అప్పులు తీర్చలేక... నడి పొలంలో గన్నేరు కాయలు నూరుకొని తాగినాడు నాయన...

గన్నేరు కాయలకు ఏం తెలుసు? రామిరెడ్డి దాన గుణం. సేవాతత్పరత. బలి తీసుకున్నాయి! నాయన పోయినాక అప్పులోళ్ళు రాబందుల తీర్న వచ్చి వాలినారు. సూటిపోటి మాటలు పడలేక సత్రంకాడి భూమి తాకట్టు పెడితిమి. చాల్లేదు. కొర్రపాడు దగ్గరి భూమి అమ్మితిమి. చాల్లేదు. కమలాపురం వెంకటరెడ్డి మామ ఇచ్చిన డబ్బూ మిగల్లేదు. మేం మాత్రం మిగిలినాం... ఎముకలగూళ్ళతో. అప్పు యింగా వుంది. నీలకంఠారెడ్డికి తీర్చాల్సిన బాకీ యింగా వుంది. ఇంటి చుట్టి కారం తిరుగుతాండడు. ఎట్టైనా బాకీ తీర్చాల. వాడి నోటికొచ్చినట్లు అంటాడు. ఈసారి బండలాగుడు పోటీల్లో వచ్చిన దుడ్లు వాడికియ్యాల వడ్డీ కింద జమ చేసుకొమ్మని. సేద్యానికి చేసిన అప్పులు నాయన ప్రాణాన్ని గన్నేరుకాయలు మింగేటట్లు చేసినాయి. అమ్మ కాంతమ్మ, చెల్లెలు లక్ష్మి, నేనూ మిగిలాం. కూలికిపోతే కుండ కాలుతుంది. లేకుంటే ఎండ కాలుతుంది. కడుపు కాలుతుంది అనే పరిస్థితి వచ్చినప్పుడు కూడా అమ్మే మమ్మల్ని పెంచి పెద్ద జేసింది. చిన్నాయన ప్రతాపరెడ్డి మాకు అండగా నిలబడ్డాడు. ఇబ్బంది వచ్చిన ప్రతిసారీ 'నేనుండాలేరా... ఆ పని నేను చేస్తానని...' ముందుకొస్తాడు. చెల్లెలు లక్ష్మికి ఈ సంవత్సరమన్నా పెళ్ళి చేయాలి. యిప్పటికే దాని ఈడు పిల్లోళ్ళం దరికి పెళ్ళిళ్ళు అయ్యి బిడ్డలు కూడా పుట్టి వుండారు.

నాయన సచ్చిపోయిన కాన్నుంచి ఇంట్లో ఒక పండగలేదు. పబ్బం లేకుండా పోయింది.

అట్నే నెగ్గుకొస్తున్నాం ఇంటిని... జీవితాన్ని!

నాయన ఏం జేసినాడు? ఎంత పని చేసినాడు? చూడు...

సేద్యం మోసం చేస్తే గన్నేరుకాయలు నూరుకొని తాగితే అప్పులు పోతాయా?

నువ్వు లేవు నాయనా... అప్పులు తీర్చిన కాడికి తీర్చినా... యింకా చెల్లి పెళ్ళి చేయాల్సి వుంది...

ఇదేనా నాయనా? రైతు భారతం.. పైరుకు ప్రాణం పోయాల్సిన నువ్వు.... ప్రాణం తీసుకోవడం ఏంది..?

రోజులెప్పుడూ ఒకేలా వుండవు కదూ నాయనా...

ఇలా నాలో నేనూ ఎన్నిసార్లు దుఃఖించానో...!

గాట్లోని ఎద్దుల్ని మరోసారి తడిమి చూసుకుంటి. ఎత్తుగా బలంగా ఎంతో అందంగా కన్పిస్తాండయి. వలపట ఎద్దు రొంత మెత్తబడినట్లు వుండాది. కురుపుకు మళ్ళీ పసురు పట్టిస్తి. ఆడనే రొంచేపు కూర్చున్నాను, ఎద్దుల్ని సూసుకుంటా.

ప్రతాపరెడ్డి చిన్నాయన వచ్చినాడు.

"ఏరా... పాపోడా... నిద్రపోలేదా? " అడిగినాడు.

"లేదు... చిన్నాయన... పోవాలకదా ఒంటిమిట్టకు. ఎట్టైనా గానీ గెల్సాలా...." చెబితి ఆయన కళ్ళదిక్కు జూస్తూ.

ఆయన కళ్ళు కూడా ఎర్రగానే వుండాయి.

అర్థమైంది. బండలాగుడు పోటీల గురించే ఆయనా ఆలోచిస్తా నిద్రపోలేదని.

"గెల్చుతాయి లేరా... నాయనా... అట్టా యింగ అదే లోకంలో వుంటే ఎట్లా" - నా పక్కనే కూర్చుంటా అన్నాడు.

"ఏం జేసేది... చిన్నాయన... అంతా

బాగానే వుంది కదా... అని అనుకుంటా వుంటినికదా. ఆ వలపట ఎద్దుకు కురుపు ఏదో లేసింది... యాపాకు పసురు పట్టించిన... తీరా పోటీలో ఏదైనా ఇబ్బంది పెడతాదేమోననిపిస్తాంది... అదే దిగులు..." రొంత బాధగా అంటి.

చిన్నాయన కూడా లేసి వలపట ఎద్దుకు లేసిన కురుపును, దానికి పట్టించిన పసురును తడిమి చూసినాడు.

ఆయన ముఖంలో ఏదో అనుమానం.

నన్నుచూసి ఆ భావాన్ని బయటపడనీకుండా "అదేం కాదులేరా... దాని గురించి ఏం ఆలోచించాకు..." అన్నాడు బీడి ముట్టించుకుంటా.

"పోతిరెడ్డిపల్లె కాన్నుంచి సదాశివారెడ్డి గాడి ఎదులు పోటీకి వస్తాయంటావా?" అని అడిగితి.

"అదే నేనూ ఆలోచన చేస్తాండ. ఆ కొడుకు పోటీ అంటే యాడ విడిచి పెడతాడు. ఆ ఎద్దుల పియ్యి తీస్తేనా! మంచి రోషగాడు. రానీ... ఎంతకాలం పోటీకొస్తాడో... యాదో ఒకనాడు వేటకొడవలితో నరికి పారేస్తా..." అన్నాడు కోపంగా చిన్నాయన.

"ఊరుకో... మనకెందుకు.. గెల్చుకుంటే గెల్చుకుంటాడు... నరుక్కోడాలు... నాశనమవ్వడాలు... మనకేంటికి?" అంటి, సముదాయిస్తా.

అయిపోయిన బీడిని కాలికిందేసి తొక్కి ఆర్పినాడు చిన్నాయన.

"బయలుదేరుదామా... చిన్నాయన ఒంటిమిట్టకు. మనం ఆటికి పోయేసరికి తెల్లారుతాంది" అని అంటిపైకి లేస్తా.

అట్నేలేమని తలూపినాడు.

నేను ఎద్దుల దగ్గరికి బయలుదేరితి.

★ ★ ★

ఒంటిమిట్ట...

కోదండరాముడు.. ఎత్తైన ఆలయం.. చూసేంత ఎత్తుగా... యాడ సూసినా రంగు కాయితాలు కట్టినారు. సందడి సందడిగా ఉంది..

ఏకశిలపై సీతారాముల విగ్రహాలు చెక్కిన పీఠం గర్భగుడిలో ఉంది... అందుకే దీన్ని ఏకశిలా నగరమని కూడా పిలుస్తారు.

మూడు ఎత్తైన గోపురాలకు హనుమంతుని బొమ్మతో వుండే కాషాయరంగు జెండాలు... ముఖ్పై రెండు శిలాస్తంభాలకు చుట్టిన రంగురంగుల కాయితాలు... ఈ గుడి ఇప్పటిది కాదు.. విజయనగర రాజుల కాలం నాటిది. పొత్రపి చోళులు కూడా దీనికి విశాలమైన ఆవరణాన్ని కట్టించినారు.

ఇక్కడున్న మూలవిరాట్ 'రఘునాయకుడు - శ్రీరాముడి' విగ్రహాన్ని జాంబవంతుడు ప్రతిష్టించాడు. పెద్ద చెరువు పక్కనే ఉంది. పెన్నానది ఈ ప్రాంతానికి ప్రధాన నీటి ఆధారంగా వుంటోంది. దత్త మండలాలను పాలించిన వీర బుక్కభూపాలుని కుమారుడైన రెండవ హరిహరరాయలు రాజ్యపాలనలో ఇది తీర్చిదిద్దబడింది. చెరువు కట్ట వెంబడి హనుమంతుడి జెండాలు రెపరెపలాడతాండయి. నిజంగా అయితే రాముడి కాళ్ళ దగ్గరే హనుమంతుడి బొమ్మ వుంటాది. కానీ ఒంటిమిట్టలోని కోదండరాముడి గుడిలో హనుమంతుడి విగ్రహమే కన్పించదు. మరి ఈ జెండాలేందో అనుకుంటి. అయినా జనం

## కొత్తగాలి...

**కన్నవారికన్నా**
**కట్టుకున్న వారి విలువెక్కువ**
**అమ్మపాలు కన్నా**
**డైరీ పాలధర తక్కువా?**

– ఈతకోట సుబ్బారావు, నెల్లూరు



ఈ సంగతిని పట్టించుకునే స్థితిలో యాడుండారు.... యాడ... అదో... ఆడ... అక్కడ... మైదానం కాడ! అవును.... అడనే కదా... బండలాగుడు పోటీలు. యాడాడనుంచో జనం పుట్ట పగిలివచ్చిన చీమల మాదిరి నిండిపోయి వుండారు. జనం... జనం... జన సముద్రం...

చెట్లమీద... గోడమీదకెక్కి చూస్తాం డరు...

నేనూ... చిన్నాయన... ఇద్దరమూ ఎద్దుల్ని తోలుకొని మైదానం మధ్యలోకి చేరుకుంటిమి.

అన్ని ఎద్దులు వచ్చిండాయి.

ఔ... దాన్లలో వుండాయి పోతిరెడ్డిపల్లె ఎద్దులు కూడా. పగ్గాలు పట్టుకొని వుండే సదాశివారెడ్డి కళ్ళు ఎగరేసి నవ్వినాడు, నన్ను జూసి.

నేనూ కళ్ళు ఎగరేసి నవ్వితి.

మా చిన్నాయన రోంత కోపంగా వాడి కేసి చూసినాడు.

వాడు ముఖం తిప్పుకున్నాడు.

తప్పెట్లు మోగుతాండాయి.

కొమ్ములు ఊదుతాండరు. చిందులేస్తాం



డరు.

జనం గోలగోలగా ఈలలు వేస్తాండరు. రంగులు ఎదజల్లుకుంటాండరు.

ముందుగా నీలిపల్లెకు చెందిన వెంకట్రా ముడి ఎద్దులు దిగినాయి బరిలోకి. దాన్లకు సగంలోనే బరువైంది. తర్వాత త్రిపురపురం నాగిరెడ్డి ఎద్దులు రంగంలోకి దిగినాయి. అవి కూడా సగంలోనే ఆగిపో యినాయి.

జనం అల్లరి ఎక్కువైంది.

నాటు సారా తాగిన ఉప్పలపాడు వీరయ్య ఎద్దులు కలివిడిగా కొంతసేపు ఊపుపైన లాగడం మొదలెట్టినాయి గానీ మధ్యలోనే దాన్లకు మైకం కమ్మింది. నిల్చి పోయినాయి. ఆ తర్వాత యర్రగుంట్ల జయరాముడి ఎద్దులు లెస్సగా వుండి పుంజుకున్నాయి. పుంజుకొని... పుంజు కొని... సగం దూరంలో గింజుకోవడం మొదలెట్టినాయి. తర్వాత తాడిపత్రి రమ ణారెడ్డి ఎద్దులు సిద్ధమైనాయి. పదైదు నిమిషాల్లో నాలుగు చుట్లు చుట్టుకొని బరువై కూలిపోయినాయి. అట్నే రాజం పేట సుబద్రమ్మ ఎద్దులు గూడా ఐదో చుట్టుకారంలో చతికిల బడినాయి. ఇక

మిగిలింది నా ఎద్దులు. తర్వాత పోతిరెడ్డి పల్లె సదాశివరెడ్డి ఎద్దులు.

జనం కేరింతలేస్తాండరు.

పలకలు మోగుతాండయి. దూరంగా జనమెక్కి వుంటే చెట్టొకటి కొమ్మ విరిగి పడింది.

నిర్వాహకులు పోయి సర్ది వచ్చినారు.

పోటీ మళ్లీ మొదలైంది.

పోతిరెడ్డిపల్లె ఎద్దులు రోసంతో ముందుకు దూకినాయి. సదాశివరెడ్డి మీసాలు దువ్వినాడు. పదైదు నిమిషాల్లో ఎన్ని చుట్లు చుట్టుకొస్తారో అని అందరూ ఆసక్తిగా చూస్తాండరు. బండకట్టినారు...

'మొదటి చుట్టు'... రంగంలోకి దిగిన ఎద్దులు పూర్తి చేసినాయి. జనం ఈలలేస్తాండరు. రంగులు జల్లుకుంటుండారు.

'రెండవ చుట్టు... మూడవ చుట్టు'... కూడా పూర్తి చేసినాయి.

తప్పెట్లు మోగుతాండయి.

సై... సై... సై... ఎద్దులు రై... రై... రై... అంటూ బండను లాగేస్తాండయి.... అదే ఊపుతో 'నాలుగు... ఐదు.... ఆరు... ఏడు' చుట్లు చుట్టినాయి. ఇంగ ఒక్క అడుగు కూడా దాన్లకు ముందుకు పడలేదు. ఆడ్నే కుప్పకూలినాయి.

పదైదు నిమిషాల సమయమూ పూర్తయ్యింది. నాకైతే ఊపిరాడడం లేదు. చిన్నాయన దిక్కు జూస్తి.

నా భుజం తట్టినాడు ధైర్యంగా!

ఎద్దుల్ని తోలుకొని మధ్యలోకి పోయినాడు.

సదాశివుడ్ని భుజాలమీద కూర్చోబెట్టుకొని ఎగురుతాండరు వాళ్ల ఊరి జనం.

రంగులు జల్లుకుంటూ వుండారు.

మా ఊరిజనం కేకలేస్తాండరు.

తప్పెట్లు మోగిపోతాండయి. ఎద్దులు మెడ విదిల్చినాయి. గంటలు మోగినాయి. అచ్చం ఆ కోదండరాముని గుళ్లో మోగినట్టే!

రై... రై... రై...

సై... సై... సై... ఎద్దులు లాగుతాండయి.

నల్లరాతి బండ ఎద్దుల వెనుక సాగిపోతాంది.

నేను రాయి తీర్న చూస్తోండిపోతి.

ఎద్దులు... పందెంతో... రోసంతో... పౌరుషంతో...'మొదటి... రెండవ... మూడవ...నాల్గవ చుట్లు' చుట్టుకున్నాయి. 'ఐదవ... ఆరవ... చుట్లు' జరిగేటప్పుడు జనంలో ఉత్సాహం మరింత ఎక్కువైంది. నరాలన్నీ బిగుసకపోయి... గొంతు చించుకొని అరుస్తాండరు. ఏడవ చుట్టలోకి... తిరిగినాయి ఎద్దులు.

సై... సై... సై... రై... రై... రై... వలపట ఎద్దు కురుపు నుంచి నెత్తురు కారుతోంది.... అట్నే తోలుతాండడు చిన్నాయన. 'దేవుడా... గెల్సాలా... రాములోరు సామీ... నా ఎద్దులు గెల్సాలా... గెల్సాలా... ఆ నీలకంఠం నా కొడుకు బాకీ తీర్చాలా... గెల్సు సామీ... గెల్సు... మనసంతా అదే దిగులు.

వలపట ఎద్దు అట్నే యీడుస్తానే వుంది. నెత్తురు కారుతాంది.

పదైదు నిమిషాలు అయితాంది. ఎద్దులు ఎనిమిదో చుట్టుకారం పూర్తి జేసినాయి. పలకల శబ్దం ఆకాశాన్ని అంటుతాంది. మా ఊరిజనం... మా చిన్నాయన్ను భుజాన ఎత్తుకొని చిందేస్తిమి.

రంగులు జల్లుకుంటిమి.

పోతిరెడ్డి పల్లె సదాశివారెడ్డి తలొంచుకొని అన్నుంచి ఎద్దులు తోలుకొని పోయినాడు. నూట పదైదు అడుగుల దూరాన్ని ఎనిమిది చుట్లు చుట్టి పదైదు నిమిషాలకు పూర్తి చేసిన మా ఎద్దులకు మొదటి బహుమతి ప్రకటించినారు నిర్వాహకులు... నన్నుపోయి తీసుకోమన్నాడు

చిన్నాయన.

చిన్నాయన వలపట ఎద్దుకు ఆకు పసరు కట్టుకోవడానికి గుడ్డను తయారు చేసుకున్నాడు.

నేను పోయి వాళ్ళిచ్చిన బంగారు గొలుసు, పదివేల నూటపదార్లు తీసుకొచ్చి నాను.

మా ఊరిజనం సంబరంగా చిందులేస్తాండరు. వలపట ఎద్దుకు కట్టు కట్టడం పూర్తి అయింది.

మైకులో రెండవ బహుమతి కింద పోతిరెడ్డి పల్లె సదాశివారెడ్డిని పిలుస్తాండరు గానీ దాన్ని తీసుకోవడానికి ఎవరూ రాలేదు.

మేము ఆ శ్రీరాములోరి దర్శనాన్ని మళ్ళా యింగోసారి చేసుకొని అన్నుంచి ఊరికి బయలు దేరినాము.

వలపట ఎద్దు కుంటుతా నడుస్తాంది. ఆకు పసురు అయితే కట్టినామే గానీ నెత్తు రైతే కారతానే వున్నింది చిన్నగా.

చిన్నాయన నాటుసారా తాగినాడు. తూగుతా తూగుతా నడుస్తాండడు.

మా ఊరిజనంతో పాటుగా సంతోషంగా అడుగులు పడుతున్నాయి. అమ్మ, చెల్లెలు గుర్తొచ్చినప్పుడల్లా ఒళ్ళంతా పులకించి పోతాంది.

★ ★ ★

సాయంకాలానికంతా ఊరుకు చేరుకుంటిమి.

అమ్మా, చెల్లెలు ఎదురొచ్చినారు.

బిందెలతో నీళ్లు దారెంబడి పారినాయి. ఊరి జనం నీళ్లతో స్వాగతం పలికినారు.

ఇంటికాడికి పోయినాంక పసుపు కుంకాలతో హారతిచ్చినారు.

బంగారు గొలుసు తీసి చెల్లెలి చేతికిచ్చాను. సంతోషపడింది. అమ్మ మురిసి పోయింది.

"బంగారు గొలుసు యియ్యడం కాదు... చెల్లెలికి బంగారమట్ట మొగుడ్ని జూసి ఆ మూడు ముళ్లు కూడా ఆ చేత్తోనే కానీ నాయనా..." చెప్పింది అమ్మ ప్రేమగా.

"అట్నే లేమ్మ... వస్తాండే సంక్రాంతి నాటికంతా బంగారమట్ట మొగుడ్ని వెతికి రాజవైభవంగా పెళ్లి చేస్తాగానీ..." అని జెప్పితి నవ్వుతా.

"ఎప్పుడూ మీకు నాపెళ్లి గురించేనా..." అంటూ చెల్లెలు లక్ష్మి యింట్లోకి సిగ్గుపడతా పరిగెత్తింది.

అమ్మా, నేనూ నవ్వుకుంటా వుంటిమి. ఇంతలో ఆ పక్క వసరాలో పండుకొని వుండే చిన్నాయన...

"ఔ... పాపోడా... అమ్మి పెళ్ళి సంకు రాత్రికంతా జరిగిపోవాలా... నా సామి రంగా... పెళ్ళికి పలకలు మోగాల... నాటు సారాయి పారాల... నేను జగ్గినక తొక్కాల.... బై... బై... ఐదు ఆడలా..." పండుకొనే ఎగుర్తాండడు తాగిన మైకంతో.

"ఔ... యింగా రోంత తాగి రావాల్సింది... ఆ ఎగరడం జూడు"- లోపల్నుంచే ఎగతాళిగా అంటాంది లక్ష్మి.

"నువ్వొక్కడివే ఎగుర్తావా ఏంది సిన్నాయనా... నేనూ జగ్గనక తొక్కనా... ఏంది..." అని దండానికి ఆరేసిన తుండు గుడ్డ నెత్తికి తలపాగాలాగా చుట్టుకొని అడుగులు వేయడం ప్రారంభించితి. మాయమ్మ నన్ను జూసి ముసిముసిగా

## కొత్తగాలి...

చెరువు కన్నెపిల్లై
తళుకుల చీరకట్టి
సూర్య నమస్కారం చేస్తోంది

-యలమర్తి అనూరాధ,
పెనుగొండ, తూ.గో.జిల్లా



మన తెలుగు... మనకు లభించిన వరం. మనమంతా కట్టుకున్న జీవన గోపురం. శిశువుల శరీర వికాసానికి అమ్మపాలు ఎలా దోహదంచేస్తాయో మన సమగ్రాభివృద్ధికి మాతృభాష అలా దోహదం చేస్తుంది. ఈ నెల *21న అంతర్జాతీయ* మాతృభాషా దినోత్సవం. ఇది సజీవ వారసత్వంగా, నిరంతర వసంతంగా నిలవాలనేదే మన ఆకాంక్ష. మనందరి అమ్మభాషకు, తెలుగు ప్రాచీనతకు పద్యాలు, శతకాలే సిసలైన సూచికలంటున్నారీ చిన్నారులు...

# తేనెలొలుకు తెలుగు పలుకు

శతక సాహిత్యం ఓ కల్పవృక్షం. నిత్య జీవిత సత్యాలెన్నో ఇందులో చిన్నచిన్న పద్యాలు, తేట తెలుగు మాటల్లో కనిపిస్తాయి. చట్టాన్ని శాస్త్రం, హితాన్ని ఇతిహాసం, బుద్ధుల్ని పురాణం అందిస్తే, సుద్దుల్ని చెప్తుంది శతకం. గురువుల్లా బోధన, ఆత్మీయుల్లా పలకరింపు, శ్రేయోభిలాషుల్లా ప్రోత్సాహం, ఉత్తమ స్నేహితుల్లా సలహాలివ్వడం. ఇలా సదా సర్వదా శతధా.. సహస్రాధిక ప్రయోజనాలు. ఈ పద్య సంపదతో ఉచ్చారణ బాగుంటుంది, జ్ఞాపకశక్తి పెరుగుతుంది, భాషాజ్ఞానం విస్తరిస్తుంది.

పిల్లలకు తొలిగురువులు తల్లిదండ్రులే. తెలుగు మాట్లాడటం, చదవడం, రాయడం ముందుగా ఇంటినుంచే మొదలవాలి.

దీనికి ఉపాధ్యాయుల మార్గదర్శనమూ తోడైతే బాలల భవిష్యత్తు బంగారం. శతక ప్రతిభను గుర్తించి బహుమతులతో ఉత్సాహపరిచేందుకు హైదరాబాద్ వేదికగా ఈ మధ్య రాష్ట్రస్థాయి ప్రత్యేక పోటీలు ఏర్పాటయ్యాయి. తెలుగు భాషా మహోత్సవాల్లో భాగంగా సాంస్కృతిక శాఖ, కిన్నెర ఆర్ట్ థియేటర్స్ నిర్వహించిన ఆ పద్యపఠన కార్యక్రమానికి ఎందరెందరో బాలబాలికలు వన్నెతెచ్చారు. వయో విభాగాలవారీగా సాగిన నాలుగు స్థాయిల పోటీల్లో డి.హర్షవర్ధిని, డి.గోపాల్, కె.ఫణిభూషణ్‌రావు, కె.దీపిక ప్రథమ బహుమతులు సాధించి సాహితీ సుప్రసిద్ధుల ఆశీస్సులందుకున్నారు. వారినీ మీరూ ఆశీర్వదించండి...

## పద్యం.... హృద్యం

కర్నూలు విద్యానగర్‌లోని మాంటిస్సోరీ పాఠశాలలో పదో తరగతి చదువుతున్నా. తెలుగు పద్యాలు చదవడమంటే చాలా ఇష్టం. నాకు 150కి పైగా పద్యాలొచ్చు. కృష్ణశతకం మొత్తాన్నీ వల్లించగలను.



వేమన, భాస్కర, భర్తృహరి తదితర శతకాల పద్యాలూ కంఠస్థమే. అన్నిటినీ ఒక్క తప్పులేకుండా రాయగలను కూడా. పలు పోటీల్లో ఇప్పటికే 15 బహుమతులు పొందాను. ఈటీవీ- 2 నిర్వహించిన పాటల పోటీలోనూ నేనే విజేతని. భాషా వికాస ఉద్యమ సంస్థ, రసమయి ఏర్పాటు చేసిన పద్యపఠనాల్లో కూడా ప్రథమురాలిని. సంగీతంమీద అభిరుచితో ఎన్నో పాటలకి స్వరకల్పనచేసి పాడాను. అమ్మ అనిత, నాన్న ఆనందరావు ఉత్సాహ ప్రోత్సాహాలతో ఇంకా ఎంతెంతో సాధించగలను.

—హర్షవర్ధిని

## చల్లని మాట- చక్కని బాట

మాది మహబూబ్‌నగర్ జిల్లాలోని మద్దూరు మండలం. ఇదే ప్రాంతంలోని పెదిరిపాడు జిల్లాపరిషత్తు



ఉన్నత పాఠశాలలో ఎనిమిదో తరగతి చదువుతున్నాను. సొంత ఊరు చెన్నారెడ్డిపల్లి. అక్కడి తెలుగు ఉపాధ్యాయులు మురళీమోహన్ తొలినుంచీ నా వెన్నుతట్టేవారు. ఇప్పుడు ఇక్కడ అదే ప్రోత్సాహం శ్రీనివాస్‌సార్‌నుంచి అందుతోంది.

నాకు 80 దాకా పద్యాలు వచ్చు. పౌరాణిక నాటకాలంటే చాలా ఇష్టం. నాన్న నారాయణ 'నువ్వు ఇంకా ఇంకా బాగా చదవాలి' అంటుంటారు. ఆయన చల్లని ఆశీస్సులతోనే రాష్ట్రస్థాయిలో మొదటి బహుమతి పొందాను.

—గోపాల్

## అన్నీ ఇష్టమే

నేను ఐదో తరగతి. మహబూబ్‌నగర్ జిల్లాలోని గద్వాలలో విశ్వేశ్వరయ్య ఉన్నత పాఠశాల విద్యార్థిని. నాకు 60కి



పైగా పద్యాలొచ్చు. కుమార, సుమతీ శతకాలంటే ఎంతిష్టమో చెప్పలేను. నాన్న రామ్మోహన్‌రావు రచయిత, గాయకుడు, ఉపాధ్యాయుడు. తెలుగు పుస్తకాలు చదవాలని, కవితలు-వ్యాసాలు రాయాలని ఎప్పుడూ నాతో అంటుంటారు. గద్వాలలోనే ఇదివరకు పద్యపఠన పోటీలు జరిగినపుడు మా అన్న కళ్యాణ్‌చక్రవర్తి బహుమతి పొందాడు. తను కూడా హైదరాబాద్ పోటీలకొచ్చి ప్రశంసాపత్రం అందుకున్నాడు. అన్నట్లు- పొడుపు, నీతికథలంటే కూడా మా ఇద్దరికీ ఇష్టమే.

—ఫణిభూషణ్‌రావు

## నేనే ముందున్నా

మా ఊరు కర్నూలు. మాది మాంటిస్సోరీ ఉన్నత పాఠశాల. నేను మూడో తరగతి. హైదరాబాద్‌లో పద్యపఠన పోటీలలో నగదు



బహుమతి నాకొచ్చింది. నాన్న సుంకన్నకి పోలీసుశాఖలో ఉద్యోగం. ఎప్పుడు ఏ పోటీలకైనా నన్ను దగ్గరుండి తీసుకెళ్తారు. అమ్మ పద్మావతి కూడా ఎప్పుడూ నా వెంటనే ఉంటుంది. నేను నాలుగు శతకాల్లోని పద్యాలు చదువుతాను. చిన్నపిల్లల్లో నేనే మొదటగా ఉన్నానని మా బడి తెలుగు భాషాసమితి కూడా మెచ్చుకుంది తెలుసా.

—దీపిక




# బంగారు బొమ్మ సోనాలి

**పెళ్లయి, ఓ బిడ్డకు తల్లైనా ఆమె అందం చెక్కు చెదరలేదు.. పైగా ఇనుమడించింది. మొదట్లో మోడల్‌గా తన ప్రస్థానాన్ని ప్రారంభించి, తర్వాత అనేక హిందీ, తెలుగు, తమిళ, మరాఠీ, కన్నడ సినిమాల్లో నటించిన బహుభాషా నటి ఆమె. హిందీలో ఆగ్, భాయి, సర్ఫరోష్, జఖమ్, డూప్లికేట్, హమ్ సాత్ సాత్ హై, తేరా మేరా సాత్ రహే, అనాహత్ తదితర సినిమాలు ఆమె కీర్తి కిరీటంలో తాపడం చేసిన వజ్రవైఢూర్యాలు. ఇంతకీ తనెవరంటే- ఇంకెవరు అందచందాల సోనాలి బింద్రే. మురారి, ఇంద్ర, పల్నాటి బ్రహ్మ నాయుడు, శంకర్‌దాదా ఎంబీబీఎస్ సినిమాల్లో నటించి తెలుగు ప్రేక్షకుల హృదయాల్లోనూ తనకో ప్రత్యేక స్థానం సంపాదించుకుందామె. అందం, ఆరోగ్యం, జీవనశైలి గురించి ఆమె ఇలా చెబుతోంది...**

✦ పోషక విలువలుగల ఆకుపచ్చని కూరగాయలు, ఆకుకూరలు, పండ్లు నా ఆహారంలో ఎక్కువగా ఉంటాయి. అలాగే తిండిలో ఆయిల్ ఎక్కువగా తీసుకోను. అదే నా ఆరోగ్య రహస్యం అనుకుంటాను. ఎక్కువ కాలరీలు పెంచే జంక్ ఫుడ్‌ని పూర్తిగా దూరంగా ఉంచుతాను.

✦ ఎక్కువగా నీరు తాగడం అలవాటు చేసుకోవాలి. తీసుకున్న ఆహారం జీర్ణం కావాలన్నా, చర్మానికి మెరుపు రావాలన్నా మంచినీళ్లే మంచి మందు. ఇక గ్యాస్‌తో కూడిన డ్రింక్స్‌ను తీసుకోను.

✦ నాది చాలా సున్నితమైన చర్మం. సూక్ష్మమైన తేడాలు సైతం దాన్ని చాలా ఇబ్బంది పెడతాయి. నిద్రలేచిన తర్వాత నా శరీరతత్వంబట్టి నాన్ మాయిశ్చరైజర్ సోప్‌తోనే మొహం కడుక్కుంటాను. ఎంత జాగ్రత్త పడితే చర్మం అంత చక్కగా నిగనిగలాడుతుంది. ఎప్పుడూ పొరపాటున కూడ మేకప్‌తో నిద్రపోను. పూర్తిగా తొలగించాకే నిద్ర. బేబీ ఆయిల్ తో దాన్ని వదిలించుకుంటాను.

✦ ప్రసవం తర్వాత ఒంట్లో పేరుకుపోయిన కొవ్వును తగ్గించుకున్నాను.





మాతృత్వం తర్వాత నా సౌందర్యం రోజు రోజుకూ వృద్ధి చెందింది. స్త్రీ నిజంగా అందంగా కనిపించేది మాతృత్వ మాధు ర్యాన్ని చవిచూసిన తర్వాతేనంటే అతిశ యోక్తి కాదు. దీంతో అద్దంలా మెరిసే అందాన్ని, వ్యక్తిత్వంలో మరింత దృఢత్వాన్ని సాధించుకున్నాను.

✦ మొదట్లో కొంచెం లావెక్కడంతో కాస్త ఇబ్బందిగా అనిపించింది. అయితే ప్రతిరోజూ మంచి శిక్షకుడి సమక్షంలో జిమ్‌కు వెళ్లి వ్యాయామం చేయడం, క్రమం తప్పకుండా మంచి ఆహారాన్ని తీసుకోవడం వల్లనే ఇదంతా సాధ్యమైంది. ఒకసారి శరీరంలో జీవక్రియలు వేగం పుంజుకున్న తర్వాత కొవ్వు కణజాలం తర గడం ప్రారంభిస్తుంది. ఆ తర్వాత క్రమం తప్పకుండా వ్యాయామం కొనసాగిస్తే ఫలితం తప్పక వస్తుంది.

✦ నాకు సైజ్ జీరో సాధించడంపై నమ్మకం లేదు. దానికోసం కడుపుమాడ్చు కోవడం కూడా మంచిది కాదు. నా సాధా రణ ఆహారపు అలవాట్లతోనే నేను సంతో షంగా ఉన్నాను.

✦ ఉత్తమ పుస్తకాల పఠనం కూడా మనసును ఆహ్లాదంగా ఉంచుతుంది. దీంతో శరీరంపై కూడా దాని ప్రభావం ఉండటంతో ఆరోగ్యం చక్కగా ఉంటుంది.

✦ ఓ గృహిణిగా అనేక విషయాల్లో తలమునకలవుతూ చాలా పనులను చేప ట్టడంద్వారా మానసికంగా సంతృప్తి పొందుతాను. తమ లక్ష్యాలు, వాస్తవజీవి తంలో ఎలాంటి పాత్ర నిర్వహించాల్సి వుందో సరిగ్గా అర్థం చేసుకుని ముందుకు పోవాలి. బాధ్యతారాహిత్యంగా ప్రవర్తిం చడం మన ఆలోచనా ప్రక్రియను, తద్వారా ఆరోగ్యాన్నీ దెబ్బతీస్తుంది.

✦ దుందుడుకుగా, ఉడుకుమోత్తనంతో ఉండటం మన జీవితానికి మంచి చేయదు. అలాగనీ ఆత్మగౌరవాన్ని సైతం పణంగా పెడుతూ అనుక్షణం రాజీపడుతూ జీవితాన్ని గడపడం కూడా మనకు మేలు చేయదు.

**– కేఆర్‌జీ**

# శిక్ష

చతుర కథలు

-బద్దిగం పాండురంగారెడ్డి



ఓ పెద్ద మందుల కంపెనీలో జనరల్ మేనేజరుగా ఓ యువకుణ్ణి అపాయింట్ చేశారు. అతడు వచ్చీ రాగానే ఆఫీసు పద్ధతుల్ని చాలావరకు మార్చేశాడు. జనరల్ మేనేజరంటే అందరికీ తగని భయమూ ఏర్పడింది. అప్పుడే చేరి పదిరోజులైంది.

ఓ రోజు- ముందు హాల్లో వేసి ఉన్న పొడుగాటి సోఫాలో ఆ కంపెనీలోనే పని చేసే ఓ యువతీ, యువకుడూ కూర్చుని జాలీగా కబుర్లాడుకుంటూ, దాదాపు కావిలించుకుని ముద్దెట్టుకున్నంత పనిచేశారు. అప్పుడే ఆఫీసులోకి అడుగుపెట్టిన జనరల్ మేనేజర్‌కి ఆ దృశ్యం కంటబడింది. తన ఆఫీస్ రూమ్‌లోకి వెళ్లి అర్జెంటుగా మేనేజర్ని పిలిపించాడు.

'ఆ కుర్రాడ్ని వెంటనే ఉద్యోగంలోంచి తీసేయాలి' అని ఆదేశించాడు జి.ఎమ్.

మేనేజర్ బిక్కమొహం వేశాడు.

"లాభంలేదు సార్! అతడు మన కంపెనీ డైరెక్టర్‌గారి మేనల్లుడే!" అని సవినయంగా మనవి చేశాడు మేనేజర్.

"ఆ అమ్మాయి ఇక మన ఆఫీసులో ఉండటానికి వీల్లేదు. ఆడదైవుండి అంత పబ్లిగ్గా, సోఫామీద కూచుని ప్రణయకలాపాలా?" కోపంగా అన్నాడు జి.ఎమ్.

ఈసారి మేనేజర్ నసిగాడు-

"ఏం..? ఆమెకూడా ఎర్కైనా బంధువా?" అడిగాడు విసుగ్గా జి.ఎమ్.

"కాదండీ! డైరెక్టర్‌గారికి ఆమె నమ్మకమైన పీఏ. ఆమెను ఊస్ట్ చేయడం మరింత కష్టం!" అన్నాడు మేనేజర్.

జి.ఎమ్ కోపంతో లేచి నేలను తన్నేడు. ఏం చేయడానికి పాలుపోలేదు- "సరే! అసలా సోఫాని హాల్లోకి వేయించిన 'వెధవ' ఎవడో ఇలా పిల్చుకురా. పని పడతాను" అంటూ పళ్ళు పటపటా కొరికేడు జి.ఎమ్.

"వచ్చిన కొత్తలో గెస్టులు కూచుంటారని తమరే ఆ సోఫా అక్కడేయించారండీ!" మేనేజర్ వినయంగా విన్నవించుకున్నాడు.

ఈ సారి జి.ఎమ్‌కి పిచ్చెక్కినంతపనై మేనేజర్ని కోపంగా చూసి 'గెటౌట్' అని అరచి చైర్లో చతికిలబడ్డాడు. ©

# భార్యాభర్తల పోటీ

-భమిడిపాటి సోమయాజి



భార్యాభర్తల ఆటపాటల పోటీలో బహుమతి పొందలేని భుజంగం తన స్నేహితునితో తన బాధను వెళ్ళగక్కాడు.

మిత్రుడు అన్నాడు "అంతా బాగానే వుంది ఆ డ్యాన్స్ సరిగ్గా చెయ్యలేకపోయావ్"

"ఏమిట్రా నీ వుద్దేశ్యం! డ్యాన్స్‌లో ఎక్కడ చెడగొట్టాను"

"అదికాదురా! 'కోడి బిర్యానీ - మినపదోశె' అని పాడేటప్పుడు, మధ్యలో కోడిలా 'కొక్కొరోకో' అని అరవడం ఎందుకు! అయినా రాత్రి తొమ్మిది గంటలకి, కోడి ఎక్కడైనా కూస్తుందా? "

"ఆ ప్రోగ్రామ్ రికార్డింగ్ తెల్లారకట్ల జరిగిందిరా! కోడి తెల్లారకట్ట, ఎలాగూ కూస్తుంది కదా అని సహజంగా వుంటుందని కోడిలా కూసాను"

"అది సరే! బాధపడతావని అన్లేదు కాని, కోడిని చంపికదురా 'కోడి బిర్యానీ' చేస్తారు. చచ్చిన కోడి ఎక్కడైనా కూస్తుందా!"

"ఏమిటో నువ్వు మరీను! కోడి బిర్యానీ ఏదో ప్లేట్లో పెట్టి డైనింగ్ టేబుల్ మీద పెట్టినట్లు మాట్లాడుతున్నావ్.

'కోడి బిర్యానీ - మినపదోశె' అనేది ఆ డ్యాన్స్ ప్రోగ్రామ్ టైటిల్ మాత్రమే" అన్నాడు భుజంగం.

"తర్వాత ఉప్పుచేప పులుసు అనే పాట

పాడమన్నప్పుడు, మరీ ఎండిపోయిన చేపలా మొహం పెట్టడం కూడా బాగా లేదు!" అన్నాడు మిత్రుడు.

"ఉప్పుచేపకి జీవకళ వుండదని, మొహం సహజసిద్ధంగా వుండాలని అలా పెట్టాను."

"నువ్ ప్రత్యేకంగా జీవం లేనట్లు నీ మొహం పెట్టఖ్ఖర్లేదురా!"

"అన్నిటి కంటే నా భార్యగా నటించినావిడ సరిగ్గా చెయ్యలేదని నా అభిప్రాయం!" అన్నాడు భుజంగం.

"అయినా కొంత నీ తప్పు కూడా వుందిరా! ఆవిడ నీ భార్యగా నటించినా, ఆవిడ నీ భార్య కాదని నీకు తెలుసు గాని, ప్రేక్షకులకు తెలీదు కదా! అంచేత సహజ సిద్ధంగా వుండాలంటే, ఆవిడ ముందు భయపడుతున్నట్లు, నువ్వు నటించి తీరవలసిందే!"

"అయితే ఆ మొదటి జంటలోని భర్త ఆయన భార్యకి అసలు భయపడలేదు కదా!"

"ఆయన విషయం నీకనవసరం! ఆయన పెళ్ళై ఓ పాతిక సంవత్సరాలయి వుంటుంది. ఆయన మొండికెత్తేసి పెళ్ళాం అంటే భయపడడం మానేసి వుంటాడు.

"పైగా నీ భార్యగా నటించినావిడ్ని చూస్తూ, 'సొగసు చూడతరమా!' అంటూ పాడావ్. పెళ్ళాన్ని చూస్తూ పబ్లిక్ స్టేజి మీద ఎవరూ అలా పాడరు. 'ప్రైవసీ'లో పాడితే ఫర్వాలేదు!"

"ఇవన్నీ దృష్టిలో పెట్టుకునే నా బహుమతికి ఆ జడ్జీలు మంగళం పాడేసారంటావా!"

"అంతే! ఏ సందేహం లేదు!" అన్నాడు మిత్రుడు. ©

# దొంగ!?

- రంగనాథ రామచంద్రరావు

కాఫీ సిప్ చేస్తూ...

తల పైకెత్తాను. తల పైకెత్తుతూ నాకు కుడి వేపున్న వరుసలో గోడవారన ఉన్న ఓ టేబుల్ ముందు కూర్చుని ఎంతో ఆబగా తింటూ తన ముందున్న ప్లేట్లను ఖాళీ చేస్తున్న 'అతన్ని' అప్పుడే చూశాను.

అతను...

తెల్లని టెరికాటన్ షర్ట్‌ను బ్లూజీన్స్ ప్యాంట్‌లోకి టక్ చేశాడు. మెడలో బ్లూ కలర్‌లో తెల్లని, ఎర్రని డాట్స్ ఉన్న టై, చక్కగా గ్రూమ్ చేసుకున్న నల్లని నొక్కుల హిప్పీ జుత్తు, కాళ్ళకు ఖరీదైన యాక్షన్ షూస్. పక్కనే తను కూర్చున్న కుర్చీకాళ్ళ దగ్గర ఉంచిన రాజకీయ నాయకుడి పొట్టలా ఉన్న నల్లని లెదర్ బ్యాగ్. బ్యాగ్‌పై ఏదో కంపెనీ పేరు తెల్లటి అక్షరాలతో మెరిసిపోతూ ఉంది. బహుశా ఏ ఎం.బి.ఎ.నో చేసి మంచి కంపెనీలో ఓ పాతిక వేల జీతంతో విలాసంగా బ్రతుకున్న అదృష్టవంతుడు కావచ్చు. అందుకనే అంత ట్రిమ్‌గా మాన్లీగా ఉన్నాడు.

అతన్ని ఎక్కడో చూసినట్టనిపించింది. అవును! ఓ అరగంట ముందు తను బస్టాండు నుంచి వస్తుంటే హడావుడిగా తనపక్క నుంచే తనను రాసుకుంటూ

వెళ్ళేడు. సరిగ్గా అప్పుడే...

ఇలాంటి వ్యక్తులను చూస్తేనే నాకు చాలా ఈర్ష్య. ఎప్పుడూ నలగని బట్టలతో, వాడని మొహంతో, చక్కటి ఆరోగ్యంతో, ఎంతో అందంగా, హుందాగా కనిపిస్తారు. విచార రేఖలు వాళ్ళ ముఖాల్లో ఎంత వెదికినా కనిపించవు. నెల పొడవునా జేబులో డబ్బులు, రకరకాల క్రెడిట్ కార్డులు ఉత్సాహపరుస్తూ ఉంటే యాక్టివ్‌గా ఉండక ఇంకెలా ఉంటారు?

కాఫీ తాగుతూ ఆ రోజు న్యూస్ పేపర్ లోని హెడ్‌లైన్స్ చూస్తూ అతను గమనించకుండా అతడ్ని ఓకంట కనిపెడుతున్నా.

టేబుల్ నిండా చోటు చేసుకున్న ఖాళీ ప్లేట్లను సుతారంగా వో పక్కకు తోసివేస్తూ దగ్గరగా వచ్చిన సర్వరుతో అతనేదో అన్నాడు. సర్వరు తలాడించి అక్కడి నుంచి కదిలాడు.

సరిగ్గా అప్పుడే అతను...

పేపర్లో మొహం దూర్చి చాటుగా అతన్ని గమనిస్తున్న నాకు ఒక్క క్షణం నా కళ్ల ముందు జరిగిందేమిటో అర్థం కాలేదు. చేతిలో ఉన్న కాఫీ గ్లాసు జారిపోతుందేమోనని అనిపించింది. వెంటనే కాఫీ గ్లాసు టేబుల్ మీద పెట్టాను. ఓ విధమైన ఉద్వేగానికి నా మనసు లోనయింది. అంతకు ముందు నా కళ్ళు చూసిందేమిటో నాకు అర్థం అయ్యింది. నాకు తెలియకుండానే పెదాలపైకి నవ్వు తోసుకు వచ్చింది.

సర్వర్ ఇచ్చిన బిల్లు అందుకున్న అతను తన లావాటి నల్లటి బ్యాగ్ అందుకుని కాష్ కౌంటర్‌వేపు నడిచాడు. కౌంటర్ దగ్గర బ్యాగ్ కింద పెట్టి వెనుక జేబులో చేయిపెట్టిన అతను కరెంట్ షాక్ కొట్టినట్టు వెంటనే చేతిని బయటకి తీశాడు.

అతని యాక్షన్, రియాక్షనూ గమనిస్తున్న క్యాషియర్ 'అతన్ని' అదోలా చూస్తూ- "ఏమైంది? "- అని అడిగాడు.

"నా పర్స్! నా పర్స్ పోయింది" అతను మెల్లగా గొణుక్కున్నాడు.

అతని మొహం భయంతో పాలిపోయింది.

క్షణం సేపు అర్థం కానట్టు చూసిన క్యాషియర్ ఏదో అనబోయాడు-

"ఇదిగో! మా ఇద్దరి బిల్లు తీసుకోండి" అంటూ యాభై రూపాయల నోటుతో పాటు నా బిల్లును క్యాషియర్ ముందుకు తోశాను. క్యాషియర్ ఏదో గొణుక్కుంటూ చిల్లర ఇచ్చాడు.

నేను అతని వేపు చూశాను.

అతను క్షణకాలం ఏమీ అర్థం కానట్టు చూశాడు. ఆ తరువాత అతని ముఖం కాంతిని తిరిగి పుంజుకున్నట్టు అనిపించింది.

క్యాషియర్ ఇచ్చిన చిల్లరను జేబులో కుక్కుకుంటూ ముందుకు నడిచాను.

నా వెంట అతను వస్తాడని తెలుసు.

నాలుగు అడుగులు వేసి జనసంచారం లేని సందులోకి తిరుగుతుండగా-

"చాలా థాంక్సండీ! మీ మేలు ఈ జన్మలో..." అతను ఏదో చెప్పబోతున్నాడు.

"థాంక్స్ తరువాత. నా షేర్ నాకు ఇచ్చేస్తే నా దారిన నేను వెళతాను"- అన్నాను.

"షేరా? ఏం షేరు..." అర్థం కానట్టు మొహం పెట్టి అన్నాడతను.

"మీబ్యాగులోని ప్లేట్లు, స్పూన్లు, గ్లాసులు అమ్మగా వచ్చే సొమ్ములో షేరు!" అన్నాను.

అతను షాక్ తిన్నట్టు ఒక్క క్షణం మౌనంగా ఉండిపోయాడు. అటు తరువాత తేరుకుని మెల్లగా-

"మీరు చూశారన్నమాట. ఇక మీ దగ్గర దాచాల్సిందేముంది? ఓ పెద్ద బట్టల షాపులో గుమాస్తాగా పనిచేసిన నాన్న నామీద ఆశలన్నీ పెట్టుకుని చదివించారు. నా చదువయ్యాక ఏదో పెద్ద ఉద్యోగం సంపాదిస్తానని, దాంతో వాళ్ళ కష్టాలు గట్టెక్కుతాయని, వాళ్లను ఆదుకుంటానని, వాళ్ల జీవితాలను ఆనందమయం చేస్తానని నా చుట్టూ ఆశాసౌధాలు నిర్మించుకున్నారు. అయితే తనవాళ్ల ఆశలన్నీ నేలకూలటంతో నాన్న కృంగిపోయాడు. చివరికి అనారోగ్యంతో మంచం పట్టాడు.

## స్టంట్‌మెన్స్ షో







హాలీవుడ్‌లో స్టంట్ మాస్టర్స్ ఒళ్లు గగుర్పొడిచే అంశాలను ప్రదర్శిస్తుంటారు. అవి ఎక్కడా అంతదాకా ఉపయోగించనివై ఉండాలని వారు తీర్మానం చేసుకున్నారు. స్టంట్‌మేన్ టోనీ సిసిరె ప్రదర్శించిన స్టంట్ ఇది. ఒళ్లు అంటుకుని కాలుతున్నా ఏం జరగనట్లే 'నేషనల్ ఎన్‌క్వయిరర్' వారపత్రికని చదువుతూ అతడు ప్రదర్శించిన ఈ స్టంట్ చాలామందిని ఆకర్షించింది.

## జనవరి-09
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికి త్వరలో బహుమతులు అందుతాయి.



1. నల్లపనేని కోటేశ్వరరావు - టి.అగ్రహారం, నెల్లూరు జిల్లా
2. ఎ.వి.రాధ - అడయార్, చెన్నయ్
3. ఎస్.ఆర్.కె.మూర్తి - ఎస్.ఎన్.పురం, విజయవాడ
4. పి.విజయలక్ష్మి - రామారావుపేట, కాకినాడ
5. బీహెచ్.విజయలక్ష్మి - పటమట, విజయవాడ-10



### సరైన జవాబులు

1. రాజకపూర్ 2. మార్క్‌ట్వెయిన్ 3. పారిజాతం 4. ఆదినారాయణ 5. భీమశంకరం/మాణిక్యాంబ 6. ఆంధ్రప్రభ 7. జార్జిమెరెడిత్ 8. రవీంద్రభారతి 9. వైజాగ్ 10. దుర్గ

వృద్ధాప్యంలో ఉన్న తల్లిదండ్రులు, ఎదిగి వచ్చిన చెల్లాయి, ఇంకా చిన్నవాళ్ళయిన తమ్ముళ్ళు, జేబులో చిల్లిగవ్వలేని పరిస్థితి. చేతిలో యూనివర్సిటీ వారిచ్చిన డిగ్రీ పట్టా. ఎక్కడా దొరకని ఉద్యోగం. ఇంటి నిండా దరిద్రం. అందుకే చివరికి నీతి నిజాయితీని పక్కకు పెట్టి ఇలా... ఇలా... తయారయ్యాను. ఇప్పుడు కనీసం నా ఇంటి వాళ్ళకు కడుపునిండా తిండి పెట్టగలుగుతున్నా..." అతను ఇంకా ఏదో చెప్పబోతున్నాడు.

నేను మధ్యలోనే ఆపమన్నట్టు చేయి చూపాను.

మనస్సంతా అవ్యక్తమైన ఆవేదనతో నిండిపోయింది.

నిరుద్యోగి బాధలు నాకు తెలియనివా? యూనివర్సిటీలో గోల్డ్ మెడల్ అందుకున్నాను. అయితే ఉద్యోగం అందని ద్రాక్షే అయింది. ఉద్యోగాల కోసం రాసిన పరీక్షలలో అదృష్టం ముఖం చాటేసింది. ఇంటర్వ్యూలలో ఆశ చివరిదాకా దాగుడుమూతలు ఆడి నన్ను నిలువునా నిరాశా సంద్రంలో ముంచేసేది. పవర్‌కు, డబ్బుకు, రెకమెండేషన్‌కు అమ్ముడుపోని ఉద్యోగం కనుచూపుమేరలో కానరావటం లేదనే విషయం కొత్త కాదుగా! ఇతని కంటే నా పరిస్థితి కాస్త బెటర్. నన్ను నేను పోషించుకుంటే చాలు. కారణం ప్రస్తుతం ఒంటరివాడిని. ఎవ్వరూలేని వాడిని. ఎవరికీ ఏమీ కానివాడిని. అయితే అతను...

"సారీ బ్రదర్! నేనూ నీలాంటి వాణ్ణే. అవినీతిమయమైన ఈ సమాజంలో, దేశాన్నే దోచుకునే బడాబడా దొంగల ముందు నేనెంత? ఎంతకీ ఉద్యోగం దొరకకపోవటంతో నేనూ ఓ వృత్తిని ఎన్నుకున్నాను. నువ్వు పోగొట్టుకున్న పర్సు ఇదే కదూ? ఉదయం బస్టాండులో మనం ఒకరికొకరం తగిలాం? సరిగ్గా అప్పుడే నా చేతుల్లోకి ఇది వచ్చేసింది" - అంటూ జేబులోంచి తీసిన పర్స్‌ను అతనిచేతుల్లో ఉంచి ఆ పక్కనే మరో సందులోకి వడివడిగా నడుచుకుంటూ వెళ్ళిపోయాను. ©

# కాలాతీతం

# సాగర గర్భంలో సాహసయాత్ర



**జూల్స్‌వెర్న్**

అది 1866వ సంవత్సరం.

వ్యాపార నౌకలకు సముద్ర మధ్యంలో ఒక వింత జీవి కనిపించిందని తెలిసి ప్రపంచం ఉలిక్కిపడింది. అత్యంత వేగంగా ప్రయాణించిందట అది. కొన్ని వందల అడుగుల పొడవున్నది. అప్పుడప్పుడూ కాంతి విరజిమ్మింది. ఓడలు దాన్ని కొట్టుకుని మునిగిపోతాయని భయపడ్డారు. జంతు శాస్త్రజ్ఞులు ఈ మిస్టరీని పరిశోధించి అదో కొత్త రకం తిమింగలం కావచ్చునన్నారు. అలా నిర్ధారణ చేసిన వాళ్లలో ప్రొఫెసర్ పియెర్ ఆరోనా ఒకడు.

1867 వేసవిలో నెబ్రాస్కా ప్రాంతంలో కొన్ని స్పెసిమెన్‌లు సేకరించి తన బృందంతో తిరిగి వస్తున్న ఈ బయాలజిస్టును తమ ప్రయత్నంలో సహకరించమని అమెరికన్ ప్రభుత్వం అర్థించింది. వింత జీవి గురించి క్షుణ్ణంగా అధ్యయనం చేయాలి. శాస్త్ర పరిశోధనలకే జీవితాన్ని అంకితం చేసిన ఈ ప్రొఫెసర్ ఆహ్వానాన్ని అంగీకరించి కేవలం మూడు గంటల్లో అమెరికావారి అబ్రహాంలింకన్ అనే ఓడను చేరి తన ప్రయోగాలు ప్రారంభించాడు. వెంట తన నమ్మినబంటు కాన్సీల్, మరో కెనెడియన్ హార్పూనర్ (తిమింగలాలను వేటాడేవాడు), శిక్షపడ్డ ఖైదీ అయిన నెడ్ లాండ్ కూడా ఉన్నారు.

కొన్ని నెలలపాటు సముద్ర జలాలలో



గాలింపు కొనసాగింది. అనేక రకాల తిమింగలాలు, సొరచేపలు, ఇతర జలచరాలు కనిపించాయి గానీ ఆ జీవి జాడ లేదు. ఒక తుపాను రాత్రి జపాను తీరంలో ఏదో వింత వెలుగు కనిపించింది. అబ్రహాం లింకన్ అటువైపు కదిలింది. ఆకారం సరిగా కనిపించలేదు. సాగరగర్భం నుండి ఒక్కసారిగా పైకి లేచి మళ్లీ మునిగింది. ఆరోనా బృందం తన వేట ముమ్మరం చేసింది. కాని ఎంత ప్రయత్నించినా అది చిక్కినట్టే చిక్కి తప్పించుకుంది. కొన్నిసార్లు, ఎవరూ అందుకోలేనంత వేగంగా ముందుకు కదిలింది. మరికొన్నిసార్లు నీళ్లలో అదృశ్యమైంది. దగ్గరగా వచ్చిందనుకున్నప్పుడు నెడ్‌లాండ్ గురిచూసి తిమింగలాలను చంపే హార్పూన్ విసిరాడు. అది ఖంగున శబ్దం చేస్తూ నీళ్లలో పడిపోయింది. లోహానికి తగిలినప్పుడేగదా అలాంటి చప్పుడు వస్తుంది. మరుక్షణం ఉవ్వెత్తున నీళ్లు ఎగిసిపడ్డాయి. తమ ఓడ అబ్రహాం లింకన్ అదుపుతప్పింది. పరిశోధకులు ముగ్గురూ నీళ్లలో పడి తాము జలచరాలకు ఆహారంకాక తప్పదని భయపడ్డారు. ఎంతదూరం ఈత కొట్టగలరు?. సమీపంలో నల్లగా మెరుస్తూ కనిపించిందో జీవి. అతికష్టం మీద, ప్రాణాలమీద ఆశ వదులుకొని ఒక్కొక్కరే దాని వుపరితలం పైకెక్కారు. అయితే అది వాళ్లనుకున్నట్టుగా తిమింగలం కాదు.

కాళ్లకూ, చేతులకూ, నల్లటి స్టీలు కవచం చల్లగా తగిలింది. 'ఇది జలాంతర్గామి!' అన్నాడు ప్రొఫెసర్. అందులో లోపల ఎవరో వున్నారన్న మాట. సహాయం చెయ్యమని గొంతెత్తి అరిచారు. వెనక భాగాన ఎక్కడో తలుపు తెరుచుకున్నది. ముసుగులు కప్పుకున్న ఎనిమిది మంది వ్యక్తులు వచ్చి వాళ్లను లోపలికి లాగారు.

జలాంతర్గామి కమాండర్ పేరు కెప్టెన్




నీమో. ఆ పేరుకు లాటిన్‌లో అర్థం 'నో వన్' అని. గ్రీకు పురాణ గాథలలో ఒడీసియస్ కూడా తనను తాను 'నో వన్'గా అభివర్ణించుకున్నాడు. అతడి గత చరిత్ర ఒక మిస్టరీ. ఎవరికీ తెలియదు. జీవితంలో జరిగిన ఒక విపత్తు వల్ల అతడు మానవజాతికే దూరంగాపోయి కొద్దిమంది అనుచరులతో సముద్రజలాల్లో నివాసం ఏర్పరచుకున్నాడు. లోకంలో దొరకని స్వేచ్ఛ యిక్కడ లభిస్తున్నది. నీమో ఒక గొప్ప సైంటిఫిక్, మెకానికల్ జీనియస్ అనటంలో సందేహం లేదు. ఒంటరిగా, స్వయంకృషితో, యింతవరకు లోకం కనీ వినీ ఎరుగని జలాంతర్గామిని నిర్మించాడు. లోపల మంచి గ్రంథాలయం ఏర్పాటు చేశాడు. గదులను అపురూప కళాఖండాలు, సంగీత వాయిద్యాలతో అలంకరించాడు. అతడు మెరైన్ బయాలజిస్టు కూడా కావటం వల్ల సేకరించిన స్పెసిమెన్లను జాగ్రత్తగా భద్రపరిచాడు. ఇదొక్కటి చాలు ప్రొఫెసర్ ఆరోనాకు అతనిపట్ల గౌరవం, ఆరాధనాభావం పెరగటానికి.

నీమో మితభాషి. అతిథులకు మర్యాదలైతే చేశాడు గానీ, తన గురించిన వివరాలేమీ చెప్పుకోలేదు. ఈ ఆగంతకులు, తన పరిశోధనా రహస్యాలు బహిర్గతం చేస్తారేమోనని సందేహించాడు. అయినప్పటికీ ప్రొఫెసర్ ఆరోనా అంటే తనకు గౌరవ

# జూల్స్ వెర్న్

## 1828 - 1905

అత్యద్భుత సాహసగాథలు రాసి ప్రపంచ పాఠకులను అలరించిన జూల్స్‌వెర్న్ జీవితం ప్రశాంతంగా గడిచింది. కొందరైతే, అంత 'డల్'గా బతికిన వ్యక్తి అడ్వెంచర్లు, ఫాంటసీలు రాయటమేమిటని ఆశ్చర్యపోయారు.

జూల్స్ గేబ్రియల్ వెర్న్ పశ్చిమ ఫ్రాన్స్‌లోని నాంటీస్‌లో జన్మించాడు. తండ్రి న్యాయవాది. సంప్రదాయ కుటుంబం. నాంటీస్ తీరపట్టణం కావటంతో బాల్యంలోనే సముద్రాల గురించి తెలుసుకున్నాడీ రచయిత. పదకొండో ఏట కేబిన్‌బాయ్‌గా ఓడలో ఉద్యోగం సంపాదించి 'ఇండియా'కు బయల్దేరాడు. తండ్రి అడ్డుచెప్పటంతో, తదుపరి పోర్టులోనే అతణ్ణి దించేసి ఇంటికి పంపారు. అయినా జూల్స్‌వెర్న్ యాత్రలు ఆపలేదు- అయితే అవన్నీ ఊహల్లోనే.

ఇరవయ్యోఏట 'లా' చదవటానికి పారిస్ వెళ్లాడు. అతణ్ణి ఆ నగరం ఆకట్టుకుంది. కథలూ, నాటకాలూ రాశాడు. కొన్ని ప్రదర్శితమయ్యాయి. ఓ నాటకాల కంపెనీ ప్రొడ్యూసర్ వద్ద సెక్రటరీగా చేశాడు. జీతం వంద ఫ్రాంకులే. 1855లో యిద్దరు పిల్లలున్న వితంతువు హనోరైన్ మొరెల్‌ను పెళ్లాడాడు. ఆదాయం పెంచుకోవలసి రావడంతో ఓ స్టాక్‌బ్రోకర్ల వ్యాపారంలో భాగస్వామి అయ్యాడు. అనేక సంవత్సరాలు ఆ లావాదేవీలు బాగానే చేశాడు. అయినా రచయితగా పేరు తెచ్చుకోవాలనే చిన్ననాటి కల చెరిగిపోలేదు.

వెర్న్‌ను సైన్స్ ఫిక్షన్ రాయమని ప్రోత్సహించిన వ్యక్తి ఫెలిక్స్ నాడార్. అతడు ఫొటోగ్రాఫర్. 1860లో ఒక పెద్ద పడవను గాలిలోకి ఎత్తగలిగినంత పెద్ద బెలూన్ తయారు చేశాడు నాడార్. ఆ ప్రేరణతో 'బెలూన్లలో ఆకాశయాన చరిత్ర' రాశాడు వెర్న్. దాన్ని ప్రచురణకు పరిశీలించిన హెట్జెల్ 'రచన బాగుందిగానీ వినోదం కల్గించేవంటే పాఠకులు ఇష్టపడతారు. దీన్ని కథగా ఎందుకు మలచకూడదు?' అంటూ సలహా యిచ్చారు. అలా తొలి సైన్స్‌నవల 'ఫైవ్ వీక్స్ ఇన్ ఎ బెలూన్' రాశాడు వెర్న్.

ఆఫ్రికా నుండి జాంజిబార్ మీదుగా, సెనెగల్ దాకా చేసిన బెలూన్ ప్రయాణం గురించిన కథ అది. ఇది సాధ్యమని అప్పటి పాఠకులు వూహించలేదు. అణువణువునా వుత్కంఠ, ఏ క్షణంలో ఏమవుతుందో తెలియదు. మొత్తంమీద అలా 'సక్సెస్‌ఫుల్ నవల'కు

ముందన్నాడు.

ఇలా ఈ తొలి పరిచయంతో జలాంతర్గామి సాహసయాత్ర ప్రారంభమవుతుంది. ఈ బృందం ఎదుర్కొన్న అనుభవాలు, కనుగొన్న చిత్ర విచిత్ర జీవులు, మొక్కలు, యితర వృక్షజాతుల వివరణలతో పాఠకుడు జలప్రళయంలో చిక్కుకుంటాడు. జలాంతర్గామి నాటిలస్ నిర్మాణం గురించి విపులమైన వివరణనిస్తాడు రచయిత. దాని పొడుగు 232 అడుగులు, విద్యుచ్ఛక్తితో నడుస్తుంది, సముద్రంలో 50,000 ఘనపుటడుగుల నీటిని డిస్ప్లేస్ చేస్తుంది. దాని తయారీకి, పరికరాలకు చాలా ఎక్కువ డబ్బులు ఖర్చయ్యాయి. కథలో జలాంతర్గామి ప్రయాణించిన దూరం 20,000 లీగ్స్. ఒక లీగ్ అంటే

ఫార్ములా కనిపెట్టాడు వెర్న్.

తొలి నవల సాధించిన అఖండ విజయంతో హెట్జెల్, వెర్న్‌లు యిరవయ్యేళ్ల ఒప్పందం కుదుర్చుకున్నారు. ఏడాదికి కనీసం రెండు మూడు నవలలన్నా ప్రచురించాలి. ఈ రచనల పాపులారిటీ ఎంత పెరిగిందంటే, వెర్న్ మరణించిన ఆరేళ్ల దాకా ఆయన పేరుతో నవలలు వెలువడుతూనే ఉన్నాయి. ఆనాటి ప్రముఖ రచయితలు విక్టర్ హ్యూగో, అలెగ్జాండర్ డ్యూమా ఇతనికి మంచి మిత్రులు.

కీర్తితో పాటు వెర్న్ సంపాదన పెరిగింది. పెద్ద ఇల్లు కొనుక్కున్నాడు. తన కోసం ప్రత్యేకంగా సెయింట్ మిషెల్ అనే పడవను తయారు చేయించుకున్నాడు. ప్రశాంతత కోసం పారిస్ వదిలి, మరో గ్రామంలో కాపురం పెట్టి పాఠకుల ఒత్తిడి నుండి దూరంగా బతికాడు. ఫ్రాంకో- రష్యన్ యుద్ధంలో తన పడవతో తీర రక్షక దళం బాధ్యతలు నిర్వహించాడు. అదృష్టవశాత్తూ శత్రువులు అప్పుడు దాడి చెయ్యకపోవడంతో బతికి బయటపడ్డాడు. ఒకనాడు ఆయన సోదరుని కుమారుడు గాస్టన్‌వెర్న్, మతిభ్రమించి వెర్న్‌ను తుపాకితో రెండుసార్లు కాల్చాడు. ఆ గాయాలలోనే జీవితాంతం బాధపడ్డాడు రచయిత. ఆ తర్వాత గ్రామ కౌన్సిలర్‌గా 15 ఏళ్లు బాధ్యతలు నిర్వహించాడు. 1870లో 'Knight'గా ప్రభుత్వ పురస్కారం అందుకున్నాడు.

వార్ధక్యంలో వెర్న్ జీవితంలో విషాదం ప్రవేశించింది. బంధుమిత్రులొక్కొక్కరే మరణించారు. ఏభై ఏళ్ల రచనల తర్వాత వ్యూహాశక్తి సన్నగిల్లింది. కొత్త ఆవిష్కరణల గురించి అధ్యయనం చేసి తన రచనల్లో ఆధునికత కోసం ప్రయత్నించాడు. అప్పటికే, హెచ్. జి. వెల్స్ లాంటి వారు సైన్సు ఫిక్షన్‌లో నూతన ఒరవడి సృష్టించారు. మధుమేహవ్యాధి ముదిరి మరణించాడు వెర్న్. ఈయన రాసిన 65 నవలల్లో, వాయేజ్ టు ది సెంటర్ ఆఫ్ ది ఎర్త్ (1864); 'ఫ్రం ఎర్త్ టు మూన్ (1865); "ట్వెంటీ థౌజండ్ లీగ్స్ అండర్ ది సీ' (1870); ఎరౌండ్ ది వరల్డ్ ఇన్ 80 డేస్ (1873); 'ది మిస్టీరియస్ ఐలండ్ (1875) ; మైకెల్ స్ట్రాగ్రాఫ్ (1876); ది బేగంస్ ఫార్చ్యూన్ (1879); క్లిప్పర్ అండ్ ది క్లౌడ్స్ (1886) ముఖ్యమైనవి.

అగథా క్రిస్టీ తర్వాత ప్రపంచంలో అత్యధిక భాషల్లోకి అనువాదితమైన రచనలు ఇతనివే.

1863లో వెర్న్ రాసిన "పారిస్ ఇన్ ది ట్వెంటీయెత్ సెంచురీ" నవలను ఆయన మునిమనుమడు 1989లో కనుగొని 1994లో ప్రచురించాడు. స్కైస్క్రేపర్లు (ఆకాశ హర్మ్యాలు), ఫాస్ట్ ట్రెయిన్స్, కార్లు, కాల్క్యులేటర్లు గురించిన కథ యిది.

మూడు మైళ్లు. ఈ దూరం భూమి వ్యాసార్థానికి పన్నెండు రెట్లు.

ప్రొఫెసర్ ఆరోనా, కెప్టెన్ నీమో డైవింగ్ సూట్లు వేసుకుని, జలాంతర్గామి నుండి బైటికి వచ్చి సముద్రగర్భం మీద నడుస్తారు. చేతిలో ఎలక్ట్రిక్ లాంపులు, వీపులకు కంప్రెస్డ్ ఎయిర్ సిలిండర్లే వాళ్లకు రక్షణ. అక్కడ మైళ్లకొద్దీ విస్తరించిన పగడాలు వాళ్లనెంతగానో ఆకర్షిస్తాయి. ఆ జలశయ్యమీద సముద్రపు మొక్కల వనం ఒకటుంటుంది. అది దాటి ముందుకు కదిలిన ఈ శాస్త్రజ్ఞులిద్దరూ షార్కులతో ప్రాణాలకు తెగించి పోరాడుతారు. ఒకచోట అగ్నిపర్వతం బద్దలై, బడబాలనం వెదజల్లిన అద్భుత దృశ్యాన్ని వీక్షిస్తారు. చరిత్ర ప్రారంభకాలంలో, సము

ద్రంలో మునిగిన అట్లాంటిస్‌లాంటి నగరాల ఆనవాళ్లూ కనిపిస్తాయి. శ్రీలంక తీరంలో ముత్యాలసాగును పరిశీలిస్తారు. అక్కడ నీమో, తన మిత్రునికి కొబ్బరికాయంత ముత్యం చూపిస్తాడు. దాని ఖరీదు అయిదు లక్షల పౌండ్లకు తక్కువ కాదని ప్రొఫెసర్ అంచనా వేస్తాడు. ఆ తర్వాత వీళ్లు నీమోకు మాత్రమే తెలిసిన సముద్ర సొరంగం గుండా ఎర్రసముద్రం నుండి మధ్యధరా సముద్రంలోకి వెళతారు. తర్వాత ప్రమాదకరమైన మరో యాత్ర ముగించుకుని మంచుఖండాల కిందినుండి దక్షిణధ్రువం చేరుకుంటారు. ఆ ప్రయత్నంలో ఆ జలాంతర్గామి కూడా మంచు ముద్దగా మారిపోతుందేమోనని భయపడతాడు ప్రొఫెసర్ ఆరోనా.

ఓ సందర్భంలో తన అతిథులకు మత్తుమందిచ్చి బంధిస్తాడు నీమో. వాళ్లకు తిరిగి స్పృహ వచ్చేసరికి ఏదో హింసాత్మక సంఘటన జరిగినట్టుగా తెలుస్తుంది. నాటిలస్‌లోని ఓ వ్యక్తి తీవ్రగాయాల పాలై నెత్తుటి మడుగులో పడి ఉంటాడు. తను ప్రతీకారేచ్ఛతో ఈ యాత్ర కొనసాగిస్తున్నానంటాడు నీమో. అయితే ఎవరిమీద ప్రతీకారం? ఎందుకు? అన్న ప్రశ్నలకు మాత్రం నవలలో సమాధానం దొరకదు. జలాంతర్గామి ఇండియా చేరినప్పుడు నీమో మొహం కోపంతో ఎరుపెక్కుతుంది. విదేశీపాలనలో దేశం మగ్గిపోతున్నదని ఆక్రోశిస్తాడు. ఆ తర్వాత కేప్ మటాపాన్ వద్ద ఒక గ్రీకు గజ ఈతగాడికి బంగారు నాణాల పేటిక ఒకటి అందచేస్తాడు- 'టర్కీకి వ్యతిరేకంగా క్రీట్ కొనసాగిస్తున్న విముక్తి పోరాటానికి సహాయంగా కాబోలు' అనుకుంటాడు ఆరోనా. ఈ సాహస యాత్రలు సిసిలీ ద్వీపాల వద్ద ముగుస్తాయి. అక్కడ నావికాదళం నాటిలస్‌పై దాడిచేస్తుంది. ఆ యుద్ధనౌకల మీద జెండాలు లేవు గనక ఏ దేశానికి చెందినవో తెలియదు. అవి బ్రిటిష్ లేదా ఫ్రెంచిదళాలు కావచ్చుననుకుంటారు.

నీమోను ఆత్మగ్లాని ఏదో తొలిచివేస్తున్నది. తలుపులు వేసుకుని, ఏకాంతంలో క్షోభననుభవిస్తాడు. బాధ, ప్రతీకారం, పశ్చాత్తాపం- అతణ్ణి దహించివేస్తున్నది. కెప్టెన్ తనను తాను గదిలో బంధించుకోవటంతో జలాంతర్గామిలో అందరూ యిష్టారాజ్యంగా వ్యవహరిస్తారు. ఇదే అదనుగా నెడ్‌లాండ్ పారిపోవటానికి పథకం సిద్ధం చేసుకుంటాడు. నాటిలస్ నీటిపైకి తేలగానే ఒక చిన్న పడవెక్కి ముగ్గురూ- ప్రొఫెసర్, కాన్సీల్, నెడ్‌లాండ్ తీరంవైపు కదుల్తారు. జలాంతర్గామి అప్పటికి నార్వే తీరం చేరింది. తన సహచరుల సలహాలను పెడచెవిన పెట్టి నీమో నాటిలస్‌ను ఒక సుడిగుండంలోకి పోనిస్తాడు. అది ప్రాణాంతకమని అందరికీ తెలుసు. ఈ భయానక దృశ్యాన్ని చూసిన ఆరోనా మూర్ఛపోతాడు. నెడ్‌లాండ్‌కు నాటిలస్‌లో నుండి ఒక హృదయవిదారకమైన కేక వినిపిస్తుంది.

ఆరోనాకు స్పృహ వచ్చేసరికి ముగ్గురూ లాఫోచెన్ ద్వీపాల్లోని ఓ మత్స్యకారుని పాకలో వున్నారు. నీమో సజీవంగా వున్నాడా? నాటిలస్ సురక్షితంగా వుందా? వగైరా ప్రశ్నలతో కథ ముగుస్తుంది.

★ ★ ★

ఈ నవల అచ్చయినప్పుడు నీమో పాత్రను సుడిగుండంలో చంపటం పాఠకులు హర్షించలేదు. ఇలాంటిదే మరో ఉదాహరణ ఉంది. అది ఆర్థర్ కానన్ డాయల్ సృష్టించిన షెర్లాక్ హోమ్స్ పాత్ర రైష్‌బాక్ జలపాతంలో మరణించినందుకు పాఠకులు నిరసన తెలిపారు. దాంతో డాయల్ మరో కథలో అతణ్ణి పునర్జీవింపచేశాడు. అలాగే 1875లో రాసిన 'ది మిస్టీ

## మంగళవారం!

### నమ్మలేని నిజం

**లాల్‌బహదూర్ శాస్త్రి జీవితంలోని కీలక సంఘటనలన్నీ మంగళవారమే జరిగాయి.**

★ ఆయన మంగళవారం రోజునే జన్మించారు.

★ చిన్నప్పుడు గంగానదిలో స్నానం చేస్తుండగా, తల్లిచేతి నుంచి జారి నదిలోకి పడిపోయారు. అదృష్టవశాత్తూ ఒక వ్యవసాయదారుడు రక్షించాడు. ఆనాడు మంగళవారం.



★ 1940వ సంవత్సరంలో ఆయన మంగళవారంనాడే అరెస్టయ్యారు.

★ మంగళవారమే ఉత్తరప్రదేశ్ మంత్రి అయ్యారాయన.

★ తర్వాత 1947లో తిరిగి మంగళవారంనాడు శాస్త్రి కేంద్ర ప్రభుత్వంలో మంత్రి అయ్యారు.

★ కాంగ్రెస్ అధ్యక్షుడి హోదాను 1951లో చేపట్టారు. అదీ మంగళవారమే.

★ ఆయన రైల్వేశాఖ మంత్రి అయింది కూడా 1957లో మంగళవారంనాడే.

★ అదే సంవత్సరంలో మంగళవారంరోజునే హోం మంత్రి అయ్యారు శాస్త్రి.

★ మనదేశానికి ప్రధాని అయ్యిందీ మంగళవారమే.

★ అలాగే డాక్టర్ రాధాకృష్ణన్ నుంచి భారతరత్న పురస్కారాన్ని మంగళవారంనాడే ఆయన అందుకున్నారు.

★ తాష్కెంటు ఒప్పందంపై మంగళవారమే సంతకం చేశారు.

★ శాస్త్రి మంగళవారంరోజునే మరణించారు.

రియస్ ఐలండ్‌లో జూల్స్‌వెర్న్ మళ్లీ నీమోను బతికించి అతడి గతాన్ని గురించిన మిస్టరీని వివరిస్తాడు. నీమో ఒక భారతీయ రాకుమారుడు. సిపాయి తిరుగుబాటులో బ్రిటిష్‌వాళ్లతో పోరాడి, భార్యాపిల్లల్ని పోగొట్టుకుని, చెర నుండి తప్పించుకుని ప్రతీకారేచ్ఛతో సముద్ర జీవనం కొనసాగిస్తాడు.

వెర్న్ నవలల్లోని ఆకర్షణేమంటే అవి సైన్సు జోడించిన అద్భుత సాహస గాథలు కావటమే. ముఖ్యంగా పాఠకుల వూహాశక్తిని ప్రేరేపించే గుహలు, నిర్మానుష్య ద్వీపాలు, ఎల్లలెరుగని సముద్రంలో ఒంటరి ప్రయాణాలు తరచు రచనల్లో దర్శనమిస్తాయి. నాటిలస్ సముద్ర గర్భంలో జలసొరంగం గుండా ప్రయాణించటం అలాంటిదే. అలాగే అగ్ని పర్వత విస్ఫోటం కూడా. ప్రతి శాస్త్ర విషయాన్నీ సమగ్రంగా పరిశోధించి వెర్న్ రచనకు పూనుకున్నాడు. గణిత సంబంధమైన ఫార్ములాలు బ్రిటిష్ ఖగోళశాస్త్రజ్ఞుడు సర్ జాన్ హెర్షెల్‌ను సంప్రదించి ఈ కథలో చొప్పించాడట. ఎంతటి అభూతకల్పనకైనా సైంటిఫిక్ గణాంకాలు జోడిస్తే విశ్వసనీయత రాక తప్పదు కదా?

★ ★ ★

విమర్శకులు సైన్సు ఫిక్షన్‌ను సీరియస్‌గా తీసుకోరు. కానీ ఆ రోజుల్లో వెర్న్ తొలిసారిగా వినూత్న సాహిత్యప్రక్రియను ప్రారంభించాడు. సాహిత్య చరిత్రలో యిదో గొప్ప మలుపు. పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధంలో, పాఠకుల్లో సైన్సు పట్ల ఆసక్తి పెరగటానికి వెర్న్ నవలలు ఎంతో సహకరించాయి.

–ఎం.వసంత

**ప్రేమకు సంబంధించి ప్రపంచంలోని గొప్ప వ్యక్తులు అనేక రకాలుగా నిర్వచించారు. ప్రేమైనా, స్నేహమైనా విలువల ఆధారంగానే ఏర్పడుతుంది. ఓ వ్యక్తి భౌతికంగా ఎంతో అందంగా ఉన్నప్పటికీ మానవాళికి శత్రువులా పరిణమిస్తే వ్యక్తిత్వం ఉన్నవాళ్లెవ్వరూ అలాంటి మనిషిని ప్రేమించలేరు. బాహ్యసౌందర్యం వెనుక కురూపితనం వికటాట్టహాసం చేస్తుం డటంతో వారు మరుగుజ్జులుగానే కనిపి స్తారు. అదేవిధంగా అంతగా అందంగా లేక పోయినా కూడా ఇతరులకు నిస్వార్థంగా సేవ చేసేవారిని మనం ప్రేమిస్తాం. వారు మనకు అందంగానే కనిపిస్తారు.**

**మా**నవాళికి ప్రయోజనకరం కాని సంబంధాల నుంచి సౌందర్యం, గౌరవం ప్రేమకు దక్కదు. ఇరవయ్యో శతాబ్దంలోనే కళాకారుల్లో అత్యున్నత ఆలోచనా ధోరణిని ప్రతిబింబించిన చార్లీచాప్లిన్ "పరస్పరం ఇతరులకు సాయం చేస్తూ, ఇతరుల ఆనందాన్ని చూసి సంతోషించడమే మనిషినైజం. సాటి మనిషి దుఃఖాన్ని మనం చూడాలనుకోం. ప్రేమను పొందనివాడే ఇతరులను అసహ్యించుకుంటాడు" అన్నాడు.

యువతీయువకుల మధ్యగానీ, భార్యాభర్తల మధ్యగానీ నిజమైన ప్రేమ ఉన్నచోట కలతలు తక్కువగా ఉంటాయి. అలాగే వారి సంబంధాలు ఎంతో హుందాగా ఉంటాయి. నిత్యం కీచులాటలు, ఒకరినొకరు దెప్పిపొడుచుకోవడాలు, పరస్పరం తమతమ ఆత్మగౌరవాన్ని కించపరచుకోవడం తదితరాలు సవ్యమైన ప్రేమ బంధంలో ఉండవు. ఒకవేళ ఎప్పుడైనా ఏదైనా చిన్న సమస్య తలెత్తినా అది వెనువెంటనే పరిష్కారమవుతుంటుంది. అభిప్రాయభేదాలున్నా అవి సరైన రీతిలో పరిష్కరించుకునే మార్గం తెరచుకునే ఉంటుంది. ఎక్కడయితే ప్రేమలో కేవలం తాత్కాలిక ఆకర్షణ, విపరీతమైన చంచలత్వం, అవకాశవాదం ఉంటాయో అక్కడ అలాంటి ప్రేమ తమ చుట్టుపక్కలవారిని సైతం కలుషితం చేస్తుంది. సహచరుల్లో అపార్థాల్ని సృష్టిస్తుంది. అంతవరకు వెల్లివిరిసిన ప్రశాంత వాతావరణాన్ని విషతుల్యం చేస్తుంది. మనుషుల మధ్య అగాధాన్ని, అసూయను, విద్వేషాన్ని రగిల్చి చివరికి ఒకరినొకరు మొహం చూసుకునే పరిస్థితి కూడా లేకుండా చేస్తుంది. అచంచల విశ్వాసం, పరస్పర నమ్మకాల పునాదులపై నిలిచే ప్రేమను ఎంతటి పెనుగాలులు సైతం ఏమీ చేయలేవు. ఆ ప్రేమబంధం చిన్నచిన్న విషయాలకే చిగురుటాకులా అల్లల్లాడదు. ఆ ప్రేమానుబంధంలో అపార్థం, అనుమానం అన్నవాటికి తావే ఉండదు. మనం పత్రికల్లో చదివే నేరాల వార్తల్లో కొన్నింటికి వివాహేతర సంబంధాలు కూడా కారణం అవడం చూస్తున్నాం. ఆ పరిస్థితికి ప్రధానకారణం ఆయా దంపతులు లేదా వ్యక్తుల నడుమ సరైన మానవ సంబంధాలు నెలకొనకపోవడమే. ఆ పరిస్థితుల్లో వారి మానసికస్థితి దెబ్బతిని శరీరంలో నెగిటివ్ హార్మోన్లు విడుదలయి, ప్రధాన అంగాలను ప్రభావితం చేస్తాయి. మానసిక ప్రశాంతత దెబ్బతింటే ఏకాగ్రత, జ్ఞాపకశక్తికీ విఘాతం ఏర్పడుతుంది. దేనిపైనా మనసు లగ్నం చేయలేరు. జీవితంలో నైరాశ్యం చోటుచేసుకుని ఆత్మవిశ్వాసం కోల్పోతారు. అంతేకాకుండా వ్యక్తుల ఆరోగ్యపరిస్థితి దిగజారి, ఆయుఃప్రమాణం కూడా క్షీణిస్తుంది. ఎవరయితే సంతోషకరమైన మానవ సంబంధాలను నెలకొల్పుకుంటారో వారే ఈతి బాధల నుంచి తమను తాము విముక్తి చేసుకుంటూ మానవ జీవితంలోని మాధుర్యాన్ని ఆస్వాదించడంలో తలమునకలవుతారు.

ఇటీవలికాలంలో నైతిక ప్రమాణాలు దిగజారుతుండటంతో మహిళలపై ఓ ఇరవైఏళ్లక్రితం వరకూ ఎన్నడూ కనీవినీ ఎరగని నేరాలు, దాడులు ఉధృతమవుతున్నాయి. ప్రేమించలేదని యాసిడ్ పోయడమో, హత్య చేయడమో, వేధించడమో సర్వత్రా కనిపిస్తూనే ఉన్నాయి. అబ్బాయిగానీ, అమ్మాయిగానీ ప్రారంభంలో పరిచయం ద్వారా దగ్గరవ్వడం, అభిరుచుల కలబోతల్లో పరస్పరం నచ్చడం, తర్వాత ప్రేమకు, వివాహానికి దారితీయడం ఓ



# ప్రేమను ప్రేమించు ప్రేమకై

ప్రజాస్వామిక మార్గం. అంతా సజావుగా జరిగితే ఫర్వాలేదు. కాస్త తేడావచ్చినా, ఒకరి ప్రేమను మరొకరు అంగీకరించకపోయినా సమస్య జటిల మవుతుంది. తమను ప్రేమించనివాళ్లు వేరెవరికీ దక్కకూడదన్న దురాలోచన మొదలవుతోంది. ఇతరుల స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలకు విలువనిచ్చే కనీస ప్రజాస్వామికధోరణి కూడా మృగ్యమవు తుంది. కొన్ని చారిత్రక కారణాలవల్ల భూస్వామ్య భావజాల సాంస్కృతిక అవశేషాలు మనసమా జంలో అలాగే మిగిలిపోయాయి. పురుషుడు తన ప్రేమను అంగీకరించలేదని హింసకు దిగిన మహిళలు వెయ్యిమందికి ఒక్కరు కూడా ఉండ రేమో? అలాగే ప్రేమతిరస్కారానికి గురవ్వడం వల్ల ఆత్మహత్యలు చేసుకునే మహిళలూ తక్కువే. పురుషపుంగవుల ధోరణి మాత్రం వీరికి పూర్తివ్యతిరేకం. తమప్రేమ తిరస్కరణకు గురైతే అవమానంగా భావిస్తారు. హత్యకు దిగడమో ఆత్మహత్యకు పాల్పడడమో చేస్తున్నారు. అయితే పురుషుల చేతిలో తీవ్రంగా మోసపోవడంవల్లనో, నమ్మించి తీసుకొచ్చినవాడే నట్టేట ముంచేయడం వల్లనో, మళ్లీ తమ జీవితాలను బాగుచేసుకునే మార్గం లేకపోవడంవల్లనో మహిళలు ఆత్మహత్య లకు పాల్పడున్న ఉదంతాలు కన్పిస్తాయి. ఇక్కడ గమనించాల్సిందేమంటే ఎవరైనా తమ ప్రేమను తిరస్కరిస్తే, 'పోతే.. పోనీలే..' అని మహిళలు కాస్త బాధపడి మిన్నకుండిపోతారు. పరిస్థితులక నుగుణంగా సర్దుకుపోతారు. కానీ ప్రతీకారం తీర్చుకోవాలనుకోరు. అహంపాళ్లు అధికంగాగల పితృస్వామిక వ్యవస్థలో పురుషుల్లో మాత్రం ఈ ధోరణి ఎక్కువగా కన్పిస్తుంది.

అలాగే ఇటీవల ప్రతిదాన్నీ తేలికగా తీసుకునే సంస్కృతి, లైంగిక స్వేచ్ఛపై మారుతున్న దృక్పథం, పెళ్లికాకుండానే కలిసి ఉండడం, పబ్ క ల్చర్‌లాంటివెన్నో వచ్చేశాయి. చాలామంది తమ జీవితాల్లో మానవ సంబంధాల్లోని మధురిమ లను కోల్పోవడంతో రోజులో కాస్సేపు దొరికే కృత్రిమ ఆనందంకోసం మందుపార్టీలకూ, డిస్కో లకు... సెక్సును, క్రౌర్యాన్ని భారీ మోతాదులో దట్టించిన చెత్త సినిమాలకు బారు లుతీస్తున్న వైనం మనకు కనిపిస్తుంది. దాని ఫలి తమే వెర్రితలలు వేస్తున్న ఆధునిక సంస్కృతి, దాన్ని అంటిపెట్టుకుని సాగుతున్న నేటి దారు ణాలు!

'నీ సంగతి నువ్వు చూసుకో.. ఇతరులెటు పోతే నీకెందుకు? ఏమైపోతే నీకెందుకు?..' అనే బోధనను తల్లిదండ్రులు అనేక రూపాల్లో పిల్లలకు నూరిపోస్తుంటారు. పరోపకారులుగా ఉండాలనీ, తోటివాళ్లందరూ మంచిగా ఉండాలని కోరుకోవాలని చెప్పేవారు కరవైపోయారు. పెద్దలు ఉగ్గుపాలనుంచే రంగరించి పోసే ఈ బోధన అక్కడకే పరిమితమై ఆగిపోదు. అది చివరికి వృద్ధాప్యంలో ఆ తల్లిదండ్రులనే పిల్లలు గాలికొదిలేలా చేస్తోంది.

ఇతరుల మనసులను గెలుచుకునేందుకు ఓపిక, సహనం, నిస్వార్థంతోపాటు వారిలోని విలువలను ప్రేమించడం అవసరం. చిన్నచిన్న లోపాలున్నప్పటికీ ప్రతివారిలోని మంచిగుణా లను గుర్తిస్తూ, వాటిని ప్రోత్సహిస్తూ ఎలాంటి షరతులు లేకుండా ప్రేమించడంవల్లనే బండరాతి లాంటి హృదయంలోనైనా ఆర్ద్రతను వెలికితీయ వచ్చు ఈ ప్రపంచంలో ప్రేమను మించినది వేరే ఏదీ లేదు.

నేడు జీవితంలోని అభద్రత వల్ల మానవ సంబంధాలు మరింత దిగజారి ఏహ్యమైన స్వార్థ పూరిత మనస్తత్వానికి జన్మనిస్తుంది. అందువల్ల దీనికి ఒక్కటే విరుగుడు..అది విలువలతో కూడిన జీవితం. సామాజిక శ్రేయస్సు దృష్ట్యా మానవసంబంధాలను ఏర్పాటుచేసుకోవడం. నేడు వ్యక్తిగత సౌఖ్యం సామాజిక ప్రయోజనానికి వ్యతిరేకంగా పనిచేయడం మనం చూస్తున్నాం. అందువల్ల నేడు మనచర్యలన్నీ సంఘహితంతో ముడిపడ్డాయా లేదా అనేది చూసుకోవడం ద్వారానే మనం మనుషులుగా మిగులగలం. అదొక్కటే దీనికి గీటురాయి.. అర్థవంతమైన జీవితానికి రాచమార్గం.

(ప్రేమికుల దినోత్సవం 14న)

# రక్త 'సంబంధం'

ట్రాఫిక్ రణగొణధ్వనులతో సందడిగా ఉన్న ట్యాంక్‌బండ్ ఒక్కసారిగా ఉలిక్కిపడింది..

ఏడాది బిడ్డను ఫుట్‌పాత్‌పై పడుకోబెట్టి, ఓ తల్లి సాగర్‌లోకి దూకేసిందన్న చేదు నిజం తెలిసి అందరి ముఖాల్లో ఆదుర్దా.. ఆందోళన!

కాపాడడానికి ఎవరో ఆమె వెనుకే నీళ్లలోకి దూకారు..

'ఆ తల్లిని ఎలాగైనా కాపాడు భగవాన్' అంటూ అక్కడ మూగిన వందలాది హృదయాలు మౌనంగా ప్రార్థిస్తున్నాయి.

ఎవరో నూటా ఎనిమిదికి ఫోన్ చేస్తున్నారు.

దూకీ దూకడంతోనే తలవెళ్లి ఏరాతికో కొట్టుకున్నట్లుంది.. వెలికితీసిన సరోజ శరీరం బురద, రక్తం మిళితమై బురద తామరలా కన్పించింది.. చావుబతుకుల్లో ఉన్న ఆమెను చూసి అంతా కదిలిపోయారు.

★ ★ ★

గాంధీ ఆస్పత్రి..

స్పృహలో లేని సరోజను స్ట్రెచర్‌మీద తీసుకెళ్తుంటే 'అమ్మ.. అమ్మ' అంటూ పసివాడు గుక్కపెట్టి ఏడవడం అక్కడి వారందరినీ కలచివేసింది. ఎత్తుకున్నవాళ్ల చంకలో నిలవక తన్నుకుంటూ తల్లిమీదకి దూకాలని వాడు నిర్విరామంగా ప్రయత్నిస్తున్నాడు. 'దేవుడా ఎలాగైనా ఆ అమ్మను కాపాడు.. ఈ బిడ్డను అనాథ చేయకు' అంటూ ఆస్పత్రి సిబ్బంది, అక్కడ చేరిన ఇతర రోగులూ మనసులోనే దేవుడ్ని వేడుకుంటున్నారు.

ఆపరేషన్ థియేటర్‌లో సరోజకు చికిత్స మొదలైంది. ఏడ్చి ఏడ్చి అలిసిన పసివాడు నిద్రాదేవి ఒడిలోకి చేరిపోయాడు. వాడి లేత బుగ్గలపై అట్టగట్టిన కన్నీటి చారికలు!

వరండాలోనే ఒక పాతచీర పరిచి దానిపై వాడిని నిద్రపుచ్చుతూ ఆస్పత్రి ఆయాలు, స్వీపర్లు మాట్లాడుకుంటున్నారు.

'బిడ్డ పండునాగున్నాడు.. ఏం కష్టమొచ్చిందో ఆ తల్లికి?' అంది స్వీపర్ యాదమ్మ బాధగా.

'అత్త, మొగుడు కట్నం ఏదింపులంట! ఎదవలు.. కాల్చుకు తినేవారంట. ఈమె సాగట్లో దూకిందని తెలింగానే ఇల్లుతాళం పెట్టి ఉడాయించిన్రు సచ్చినోళ్లు..' జవాబిచ్చింది ఆయా మంగళ.

'ఎంత డబ్బు యదాన కొట్టినా ఇంకా ఇంకా కావాలంటరు బాడ్‌కోవ్‌లు' కసిగా తిట్టిపోసింది కాశింబీబీ.

అంతలో థియేటర్‌లో నుంచి బయటకు హడావిడిగా వచ్చిన సిస్టర్ మేరీని చూసి చటుక్కున లేచి 'ఏంటమ్మా ఎలా ఉంది?' అని అడిగింది యాదమ్మ.

'అర్జంటుగా రక్తం కావాలంట.. ఆ గ్రూప్ మన బ్లడ్‌బ్యాంక్‌లో లేదు.. వెరీవెరీ రేర్ గ్రూప్.. సిటీలో ఏ బ్యాంకులో కూడా దొరకదు... ఎలాగో ఏంటో?' అంటూ సూపరింటెండెంట్ చాంబర్‌లోకి పరుగెత్తింది మేరీ.

'అయ్యో... బగమంతుడా ఈ బిడ్డని దిక్కులేని వాడ్ని చెయ్యకు' పైకిచూస్తూ చేతులెత్తి దండం పెట్టింది యాదమ్మ.

'సిస్టర్ సిస్టర్..' అంటూ డాక్టర్ ప్రవీణ్ మేరీని వెదుకుతూ థియేటర్‌లోంచి బయ

టకు పరుగెత్తుకొచ్చాడు. ముఖాన పట్టిన చెమటలు ఆయన ఎంత కంగారుగా ఉన్నాడో తెలియచెబుతున్నాయి.

'సిటీలోని బ్లడ్ బ్యాంకులన్నింటికీ ఫోన్ చేస్తున్నారు సూపర్నెంటు సార్' వగర్చు కుంటూ ఆయనకు ఎదురొచ్చింది సిస్టర్ మేరీ.

'మైగాడ్... ఇప్పుడెలా? సరే నువ్ పద... పల్స్ డౌన్ అవుతోంది..' అంటూ ప్రవీణ్ మళ్లీ లోపలకు పరుగుతీశాడు.

అతన్ననుసరించింది మేరీ. ఆ వెనుకే పరుగుతీశారు సిస్టర్ కమల, విశాలి..

అందరి ముఖాల్లో కొట్టవచ్చినట్లు ఆందోళన..

మరో రెండు నిముషాల్లో సూపరింటెండెంట్ తనగదిలోంచి వడివడిగా థియేటర్ వైపు వచ్చాడు. ఆయనతోపాటు డాక్టర్ రామస్వామి, డాక్టర్ చంద్రశేఖర్‌లు ఇంచుమించు పరుగులాంటి నడకతో వస్తున్నారు..

'వెరీబ్యాడ్.. ఆ గ్రూప్ ఎక్కడా దొరకడం లేదు.. ఇప్పుడెలా? మహావీర్ వాళ్లు మాత్రం చెక్‌చేసి ఏ విషయం అరగంటలో చెబుతామన్నారు..' అంటున్నాడు సూపరింటెండెంట్.

'అంతదాకా కష్టమేమో సార్' అంటున్న డాక్టర్ రామస్వామి-

థియేటర్ తలుపు దగ్గర నిలబడిన యాదమ్మ, మంగళ, కాశింబీబీ, సువార్తలను చూసి చిరాకుపడ్డాడు.

'ఏమిటి మీరంతా ఇక్కడ మూగారు? ఇక్కడేమైనా కోతులాడుతున్నాయా? పొండవతలకు..'

'కాదు సార్..' గొంతు పెగుల్చుకుంది మంగళ.

'...నా బ్లడ్ ఆ గ్రూపో కాదో తెలియదు.. పనికొస్తుందేమో చూసి తీసుకోండి సార్.. ఆ పిల్లాడ్ని మాత్రం అనాద చేయద్దు సార్' అంది ఉద్వేగంగా. అలా అంటున్నప్పుడు ఆమె గొంతు సన్నగా వణికింది.

సూపరింటెండెంట్‌తోపాటు డాక్టర్లిద్దరూ ఠక్కున ఆగిపోయారు.

'దానిది సరిపోకుంటే పోనీ మాది తీసుకోండి సార్.. ఆ తల్లిని ఎలాగైనా కాపాడాల సార్..' కాశింబీబీ, సువార్త, యాదమ్మ ముగ్గురూ ఏకకంఠంతో అన్నారు.

ఎప్పుడొచ్చారో ఏమో వాళ్ల వెనక వార్డుబాయిలు రమేశ్, రంగ, సులేమాన్, జాన్.. వాచ్‌మన్ గోపాల్ ఇంకా ఎందరో!

అందరిదీ ఒకేమాట- 'పోనీ నాది పనికొస్తుందేమో చూడండి'

వాళ్లందరి కళ్లలో ఆ పసివాడు దిక్కులేనివాడు కారాదన్న ఆరాటం స్పష్టంగా కన్పించింది సూపరింటెండెంట్‌కు, డాక్టర్లకూ.

తలుపు దగ్గర గొడవ ఏదో జరుగుతోందని గ్రహించి బయటకు వచ్చిన డాక్టర్ ప్రవీణ్‌కు కాశింబీబీ వాళ్లంటున్న మాటలు విన్పించాయి.

అతని భ్రుకుటి ముడిపడింది..

ముఖంలో రంగులు మారాయి..

వెంటనే నిర్ణయం తీసుకున్నాడు.

మరుక్షణమే సూపరింటెండెంట్‌తో-

'సార్.. వీళ్లు నా కళ్లు తెరిపించారు. అసలు నాకీ విషయం ఇంతవరకూ ఫ్లాష్ కానేలేదు. ఇన్‌దిస్ కనసర్న్ ఐయామ్ అషేమ్డ్ ఆఫ్ మైసెల్ఫ్! నాది సేమ్‌గ్రూప్ బ్లడ్ సార్.. నేనిచ్చేస్తాను. డాక్టర్ రామస్వామిని ఆపరేషన్ అటెండ్ చేయమనండి..' అని సిస్టర్‌మేరీ వైపు తిరిగి-

'ప్లీజ్ నా బ్లడ్ తీసుకుందువు పద సిస్టర్.. ఎక్కువ టైమ్‌లేదు మనకు' అంటూ గబగబ థియేటర్‌లోకి నడిచాడు.

వరండాలో కాశింబీబీ ఒళ్లో పడుకున్న సరోజకొడుకు తనకేమర్థమైందో ఏమో కిలకిల నవ్వాడు.

–చంద్రప్రతాప్

# మనసున ఉన్నదీ...



★ కొత్త సంవత్సరం ప్రథమంలో సంగీత నృత్య కళా ప్రదర్శనలతో భారతీయ సంస్కృతిని ప్రతిబింబించే 'సమాగమం' నవలను పాఠకులకు అందించిన చతురకు, నవలా రచయితకు అభినందనలు! మనుషులు ఎలా జన్మించారన్నది, ఎవరికి పుట్టారన్నది ముఖ్యంకాదు. ఎటువంటి సంస్కృతి, సంస్కారం ఉన్న కుటుంబంలో పెరిగారన్నదే ఒకరి సభ్యత, సత్ప్రవర్తనను తెలియజేస్తుంది. శ్రావణి, వేణు పాత్రల చిత్రణ అందుకు నిదర్శనంగా ఉంది. అన్ని పాత్రల్ని రచయిత అత్యద్భుతంగా చిత్రీకరించారు.

**– పారుపల్లి వెంకటేశ్వరరావు**, హైదరాబాద్

★ చతురలో ఇస్తున్న 'నివాళి' శీర్షిక చాలా బాగుంటుంది. జనవరిలో 'కథ వెనుక కథ' లో డా. సి. ఆనందారామం నవల శారదలోని కథాంశంలో మారని ప్రాథమిక స్వభావాల ప్రాముఖ్యాల వివరణ ఆకట్టుకుంది. కాలాతీతంలో డయానా ఆఫ్ ది క్రాస్‌వేస్ నవలా పరిచయం బాగుంది. ట్యాంక్‌బండ్ కథ 'మళ్లీ అమ్మ దగ్గరకి' కన్నతల్లి పెంచిన ప్రేమకు, ఆమె చివరి దశ అవస్థలకు అద్దం పట్టింది. ఈసారి 'హాస్య స్ఫూర్తికి అందమైన నజరానా!'కు కాప్షన్ మీదే వైవిధ్యంగా ఉంది.

**– అనుముల శివాణీ**, వరంగల్

★ సి. యస్. రావుగారి సమాగమం నవలలో 'ఓసారి తప్పు జరిగితే, దాన్ని పునరావృతంకాకుండా సరిదిద్దడమే సంఘంచేసే న్యాయం' అని వివరించిన రచయిత అభినందనీయులు. అపార్ట్‌మెంటాలజీ సంఘంలోని అవినీతిని చక్కని హాస్యచతురతతో ప్రతిబింబించింది. కొత్త శీర్షిక 'జ్ఞాన పీఠాలు' ఎలా ఉంటుందోనని ఉత్సాహంతో ఎదురు చూస్తున్నాం.

**– ముమ్మిళ్ల వందన**, హన్మకొండ

★ జనవరి చతుర నవల 'సమాగమం' చదువుతున్నంతసేపు 1959నాటి డా. నీహార్ రంజన్ గుప్త బెంగాలీ నవల 'ఉత్తర ఫల్గుణి' గుర్తొచ్చింది. అప్పట్లో కలకత్తాలో ఉన్న నాకు ఆ నవలను అదే పేరుతో బెంగాలీలో సినిమాగా తీసిన విషయం గుర్తుంది. భీమశంకరం పాత్రను బిక్షరాయ్, వేణు పాత్రను బిశ్వజిత్, శ్రావణి, పారిజాతం పాత్రలను ద్విపాత్రాభినయంతో సుచిత్రాసేన్ చేశారు. అదే నవలను హిందీలో 'మమత' పేరుతో సినిమా తీశారు. అందులో అశోక్‌కుమార్ భీమశంకరం పాత్రను, ధర్మేంద్ర వేణు పాత్రను, సుచిత్రాసేన్ శ్రావణి, పారిజాతం పాత్రలను ద్విపాత్రాభినయంతో చేశారు. అయితే సి. ఎస్. రావుగారు అలాంటి విషయాన్నే తెలుగు నేటివిటీతో చక్కగా మలిచేరు. ఇలాంటి మంచి నవలను అందించినందుకు చతురకు, రచయితకు అభినందనలు.

**– డి.వి.రమణ మూర్తి**, కాకినాడ

★ జనవరి చతుర నవల 'సమాగమం' చక్కగా ఉంది. మంచి ఇతివృత్తంతో సులభ శైలిలో నవలీకరించిన తీరు బావుంది. వేణు, శ్రావణి పాత్రలు ఆదర్శప్రాయంగా ఉన్నాయి. చివర్లో ఇస్తున్న చతురకతల సంఖ్య పెంచితే మరింత బాగుంటుంది. 'కొత్తగాలి' చిరుకవితలు కూడా చాలా బాగున్నాయి.

**– జి.గోపాలకృష్ణ**, అరసవిల్లి

★ సి. ఎస్. రావు సమాగమం బాగుంది. బతుకు పోరాటంలో తలవంచిన ఓ తల్లి కూతురి భవిష్యత్తు గురించి ఆలోచించింది. అలాగే అలాంటి తల్లికి పుట్టిన శ్రావణిని కోడలిగా చేసుకోవడానికి పెద్దలు వ్యవహరించిన తీరు ఆకట్టుకుంది. కథ వెనుక కథలో శారద, కాలాతీతంలో డయానా ఆఫ్ ది క్రాస్‌వేస్, టాంక్‌బండ్ కథ, శంకరమూర్తి కారు రిజిస్ట్రేషన్ ఆకట్టుకున్నాయి.

**–యరబోలు శ్రీనివాస రెడ్డి**, కట్టకూరు

---

చిరునామా: మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ –500 082

ఈ మెయిల్ చిరునామా: chatura@eenadu.net



# చతుర ప్రవేశిక



## ఫిబ్రవరి - ౦౨

ఫిబ్రవరి 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయ గలరేమో ప్రయత్నించండి. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం.

1. రేనాటి చోళుల రాజ లాంఛనం?
2. వెన్నెలపాట పాడేదెవరు?
3. మాధవరెడ్డి కూతురు ఎవరిని పెళ్లిచేసుకుంది?
4. ఖాదర్‌కి ఉంగరాన్ని బహూకరించిన అమ్మాయి?
5. స్మాల్ బిల్డింగ్ కాంట్రాక్టును చేపట్టిందెవరు?
6. 'ఒటక్కు షల్' అవార్డును నెలకొల్పిందెవరు?
7. జర్నలిస్టు శ్రీనివాస్ పనిచేసే ఛానెల్ పేరు?
8. జూల్స్ వెర్న్ రాసిన తొలిసైన్స్ నవల?
9. సరోజకు రక్తం ఇచ్చేందుకు ముందుకొచ్చిన డాక్టర్?
10. అంతర్జాతీయ మాతృభాషాదినోత్సవం ఎప్పుడు?

పంపినవారి పేరు: ------------------------------ వయసు (    )

చిరునామా: ----------------------------------------

----------------------------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

ప్రవేశికలకు చివరి తేదీ 16

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

నోట్ : చతుర ప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపవచ్చు.

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.

